# కండ్లు జబ్బులకు



కండ్ల కలక మంటలు, పుసి కట్టుట, అంటు కొనుట మబ్బుగ నుండుట వీటిని తొలగించును.

## EYE-COLD LOTION



Manufacturers :
**THE EYE COLD LOTION DEPOT**
Post Box No. 2
PRODDATUR
Andhra Pradesh

# Medicated PYORRHOEA LOTION



## పళ్ల నొప్పులకు, చిగురు జబ్బులకు

ఈ పయోరియా లోషన్ చిగురు వాపులు, చీము నెత్తురు కారుట, పళ్లనొప్పులు, దుర్వాసన మొదలగు పండ్ల జబ్బులకు చాల ఉపయోగకరమైనది. ఈ మందు వయసు పమేయము లేక అందరిచే వాడదగినది.

**DISTRIBUTORS : SEETHARAMA GENERAL STORES (Agencies) Vijayawada & Secunderabad. PUSHPA TRADING COMPANY, 145, Nainiappa Naick Street, Madras-600 003, Phone No. 32281 VENKATESWARA AGENCIES, 13, B. V. K. Iyengar Road, Bangalore-560 053.**

# రాసే పిల్లల కోసం



# స్వాన్

## జూనియర్ పెన్ను




అత్యుత్తమ ఫలితాలకోసం వాడండి
**స్వాన్** డీలక్స్ సిరా



**స్వాన్** (ఇండియా)
ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి . న్యూ ఢిల్లీ

# చందమామ కేమెల్
రంగుల పోటీ
ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**
కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.



12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.
**Chandamama 'Corinthian' Flat No. 5, 2nd Floor, 17 Arthur Bunder Road, Colaba, Bombay-400 005.** ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ______________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి

**CONTEST NO.6**

**ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ.** 20-12-1976

**Results of Chandamama–Camlin Colouring Contest No. 4 (Telugu)**

*1st Prize*: K. Ramalingeswara Rao, Waltair. *2nd Prize:* Kamala Achutasam, Vizianagaram. *3rd Prize*: T. G. Sandhya. Madras. *4th Prize*: K. Symala, Viziangaram. D. Hemanthkumar, Hyderabad. M. Umamaheswar Rao, Guntur. V. Ashok Kumar, Bhimavaram. P. V. S. S. Sharma, Hyderabad. *Merit Certificates:* Karada Srinivas Rao, Palakol. Kora Geetanjali, Eddapalli. A. Harikumar, Viziangaram. Konde T. Prakasa Rao, Vizianagaram. T. Venkat Rao Aliabad, Hyderabad. S. K. Srinivas Rao, Aloor. Y. Srinivasachakrabarti, Vizianagaram. Jagdish Ramchandra Innu, Bombay. Jana Nageswara Rao, Mori. M. Venkata Ravikumar, Brahmanakodur.

# వనిత

స్త్రీ జన పక్ష పత్రిక

దీపావళి నవలల పోటీలో
మొదటి బహుమతి పొందిన

## రాధ

(సశేష నవల)

ప్రసిద్ధ మానసిక వైద్యురాలు డాక్టర్ పద్మాసిని చెప్పే

## ఒక యథార్థగాథ

(సీరియల్)

'వనిత' అక్టోబర్ 15 సంచికనుంచీ వెలువడుతున్నాయి

ఇవి కాక కథలు, వ్యాసాలు, తక్కిన శీర్షికలు

వనితలకు పనికివచ్చే మరెన్నో విశేషాలు ఉంటాయి

మీ మంచి అలవాట్లలో మరొక మంచి అలవాటు వనిత ప్రతి సంచికా చదవడం!

ప్రచురణ : చందమామ పబ్లికేషన్స్, మద్రాసు 600 026




# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు సైజులలో
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/A

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [" మాయాసుధీరుడు "] నారెడ్డి నాగిరెడ్డి రచన. లోకంలో సాధారణంగా లౌకికశక్తుల కన్న అతీతశక్తులు ఎక్కువైనవిగా ఎంచబడతాయి. కాని అది నిజంకాదని ఈ కథ రుజువు చేస్తుంది. లోక వ్యాపారం కొనసాగుతున్నదీ, జీవితం ముందుకు పోతున్నదీ లౌకిక శక్తుల సహాయంతోనే గాని, అతీతశక్తుల సహాయంతో కాదు. ఏ దేశంలో ప్రజలు ఎక్కువ సంఖ్యలో మోక్షం పొందుతారో ఎవరూ గణించరు. ఏ ప్రజలు భౌతికంగా ముందుకు పోయారన్నది ముఖ్యం. అది మానవశక్తులే నిర్ణయిస్తాయి.

సంపుటి 59 డిసెంబర్ '76 సంచిక 6

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA




యస్యార్థా స్తస్య మిత్రాణి,
యస్యార్థా స్తస్య బాంధవాః,
యస్యార్థా స్స పుమాన్ లోకే,
యస్యార్థా స్స చ పండితః. 1

[ధనం గలవాడికే స్నేహితులు; ధనం గలవాడికే బంధువులు; ధనం గలవాడే పురుషుడు; ధనం గలవాడే పండితుడు.]

యస్యార్థా స్స చ విక్రాంతో,
యస్యార్థా స్స చ బుద్ధిమాన్,
యస్యార్థా స్స మహాభాగో,
యస్యార్థా స్స మహాగుణః. 2

[ధనం గలవాడే పరాక్రమవంతుడు; అతడే బుద్ధిమంతుడు; అతడే అదృష్టవంతుడు; అతడే గుణవంతుడు.]

యస్యార్థా ధర్మకామార్థాః
తస్య సర్వం ప్రదక్షిణం;
అధనే నార్థకామేన
నార్థ శ్శక్యో విచిన్వతా. 3

[ధనం గలవాడికి ధర్మకామాలు సిద్ధిస్తాయి. ధనం లేనివాడి కోరికలు ఎలాగూ సిద్ధించవు.]

ధనం – 2



## 42

సోమిలకుడు తన ఊరికి బయలు దేరాడు. సూర్యాస్తమయం అయేసరికి ఆ పాత మర్రిచెట్టే అతనికి ఎదట కనిపించింది. తన దుస్థితి గురించి ఆలోచిస్తూ అతను మగతలో పడిపోయి, కలగన్నాడు.

ఆ కలలో అతనికి, ఆ ఇద్దరు మనుషులూ కనిపించారు. అందులో ఒకడు, "ఓ కర్తా, సోమిలకుడికి అయిదు వందల బంగారు కాసులు ఎందుకిచ్చావు?" అన్నాడు.

దానికి రెండోవాడు, "ఓ కర్మా, అతని కృషికి తగినఫలితం ఇయ్యటం నాధర్మం. కావాలంటే నువు తీసేసుకో," అన్నాడు.

ఈ మాటలు వింటూనే సోమిలకుడు తన సంచీ చూసుకుని, డబ్బు పోయినట్టు గ్రహించి, "ఈ చిల్లి గవ్వ చెయ్యని బతుకు దేనికి? ఈ మర్రిచెట్టుకే ఉరి వేసుకుంటాను," అనుకున్నాడు. ఆ చుట్టు పక్కల పెరిగే దర్భలను తెచ్చి, వాటితో తాడు పేని, దానికి ఉచ్చు అమర్చి, ఉచ్చు మెడకు తగిలించుకుని, దూకబోతూండగా ఆకాశంలో ఒక దివ్య స్వరూపుడు ప్రత్యక్షమై, "సోమిలకుడా, అఘాయిత్యం చెయ్యకు. నీ బంగారాన్ని తీసుకుపొమ్మన్న కర్తను నేనే! కర్మను ఎదిరించి నువు చేసిన కృషికి సంతోషించాను. ఏం వరం కావాలో కోరుకో," అన్నాడు.

సోమిలకుడు, "అలా అయితే నాకు అపారమైన సంపద ప్రసాదించు," అన్నాడు.

"మిత్రమా, నీకు తిండీ, బట్టా తప్ప ప్రాప్తం లేనప్పుడు అపారమైన సంపద ఎలా అనుభవిస్తావు?" అని కర్త అడిగాడు.

---

అట్ట చివరి బొమ్మ

---



"అయినా నాకు సంపద ప్రసాదించు," అన్నాడు సోమిలకుడు.

''సరే. నువు వర్ధమాన పురానికి మళ్ళీ వెళ్ళు. అక్కడ ధనగుప్తుడూ, భుక్త ధనుడూ అనే ఇద్దరు వర్తకులున్నారు. వారిలో ఎవరిలాగా ఉండగోరుతావో చెప్పు. నీ కోరిక తీర్చుతాను,'' అని ఆకాశంలోని దివ్యపురుషుడు అంతర్ధానమయాడు.

సోమిలకుడు వర్ధమానపురానికి తిరిగి వెళ్ళాడు. అతి కష్టం మీద అతనికి ధనగుప్తుడి ఇల్లు ఎక్కడ ఉన్నదీ తెలిసింది. ధనగుప్తుడు ఎవరో చాలా మందికి తెలియదు. ఎందు చేతనంటే అతను దానధర్మాల కిందగాని, వినోదాలకు గాని, అనవసర వస్తువులు కొనటానికి గాని చిల్లిగవ్వ ఖర్చు చేసినవాడు కాడు.

సోమిలకుడు వెళ్ళి అరుగు మీద కూర్చున్నాడు. అది భోజనాలవేళ. ధనగుప్తుడు లోపల లేడు. అతని భార్యా, పిల్లలూ వచ్చి సోమిలకుణ్ణి వెళ్ళగొట్టటానికి ప్రయత్నించారు. అయితే సోమిలకుడు కదలక, ''నేను సంధ్యవేళ వచ్చిన అతిథిని. నాకు భోజనం పెట్టటం మీ విధ్యుక్తధర్మం," అన్నాడు.

కొంత ఘర్షణ జరిగిన మీదట సోమిలకుడికి అమిత హీనమైన భోజనం లభించింది. అలసి ఉన్న సోమిలకుడికి త్వరలోనే నిద్ర పట్టింది. కలలో ఆ ఇద్దరు వ్యక్తులూ రహస్యంగా మాట్లాడుకున్నారు.

''ఓ కర్తా, పాపం ధనగుప్తుడికి ఈ భోజనం ఖర్చు ఎందుకు కలిగించావు? ఇది చాలా అనుచితం,'' అన్నాడు ఒకడు.

''ఓ కర్మా, అది నా తప్పు కాదు. ఈ అదనపు ఖర్చు సరిచేసే భారం నీది,'' అన్నాడు రెండోవాడు.

సోమిలకుడు నిద్రలేచి, కొద్ది క్షణాల కల్లా ధనగుప్తుడు ఇంటికి తిరిగి రావటం చూశాడు. ఎవరికో భోజనం పెట్టిన సంగతి వినగానే ధనగుప్తుడికి గుండె అవిసిపోయింది. అతనికి అపరిమితమైన ఆగ్రహం కలిగి, నిద్ర పట్టలేదు. తెల్లవారు

ఝామున అతనికి భేదులు ప్రారంభ మయాయి. ఇదంతా కళ్లారా చూసి సోమిల కుడు భుక్తధనుడి ఇంటిని వెతుక్కుంటూ బయలుదేరాడు. అతనికి శ్రమలేకుండా ఇల్లు దొరికింది. ఎందుకంటే, అందరూ అతని ఇల్లు ఎరుగుదురు.

భుక్తధనుడు సోమిలకుణ్ణి వాకిలి వద్ద చూస్తూనే ఆదరంగా పిలిచి, గౌరవించి, అతని చేత చక్కగా స్నానం చేయించి, కొత్త బట్టలిచ్చి, భోజనంపెట్టి, రాత్రి పడుకోవటానికి మంచి పక్క ఇచ్చాడు. మంచి సుఖనిద్రలో ఉన్న సోమిలకుడికి ఆ ఇద్దరు మనుషులూ రహస్యంగా మాట్లాడుకోవటం వినబడింది.

"ఓ కర్తా, సోమిలకుడి ఆతిథ్యం నిమిత్తం భుక్తధనుడి చేత చాలా డబ్బు ఖర్చు చేయించావు. రేపటి ఖర్చుకు అతని దగ్గిర చిల్లిగవ్వలేదు. పైపెచ్చు ఇతను ఖర్చు చేసిన డబ్బు మరొక వర్తకుడిది. రేపటి విషయం ఏం చెయ్యా దలిచావు?" అని అడిగాడు ఒకడు.

"ఓ కర్మా, రేపు తెల్లవారుతూనే రాజు పంపిన మనిషి భుక్తధనుడికి అనేక బహుమానాలూ, బోలెడంత డబ్బూ తెచ్చి ఇస్తాడు," అన్నాడు రెండోవాడు.

ఇదంతా విన్న సోమిలకుడు తెల్లవారుతూనే రాజుగారి మనిషి బహుమానాలతో రావటం చూశాడు. "ఈ భుక్తధనుడి వద్ద నిధులు లేకపోయినా, ఇద్దరిలో ఇతనే చాలా మెరుగు. కోట్లున్నప్పటికీ ధనగుప్తుడు నీచుడు. తాను అనుభవించి, ఇతరులకు దానం చెయ్యగలిగినప్పుడే ధనం వల్ల ఉపయోగం," అనుకున్నాడతను.

అతను కర్తతో, "భగవాన్, నాకు భుక్తధనుడి సంపదలాటిది ఇయ్యి. ధనగుప్తుడి ఐశ్వర్యం నాకు అవసరం లేదు," అన్నాడు.

కర్త అతనికి తరగని సంపద ఇచ్చాడు. సోమిలకుడు తన ఇంటికి తిరిగివచ్చి, ధారాళంగా ఖర్చు చేస్తూ, తన భార్యతో సుఖంగా జీవించాడు.



# 180. ప్రాచీన ప్రాణి అవశేషాలు

అనేక కోట్ల ఏళ్ళక్రితం భూమి మీద రాక్షస ప్రమాణాలు గల బల్లులూ, ఏనుగులూ, ఖడ్గమృగాలూ మొదలైనవి ఉండేవి. కాలక్రమాన ఆ ప్రాణిజాతులు అంతరించి, వాటి అస్థికలు శిలీభూతం అయాయి. మంగోలియాలో కొన్ని ప్రాంతాల నేలకు ఆరడుగుల లోతున ఈ ప్రాణుల "ఫాసిల్" ఎముకలు దొరుకుతున్నాయి. ముఖ్యంగా నదులు నేలను కోసినచోట్ల, ఆ నదులు పట్టిపోయిన అనంతరం భూమిని తవ్వకుండానే ఈ ఎముకలు దొరుకుతున్నాయి. బొమ్మలో కనిపించే ఫాసిల్ ఎముకలు రాక్షసి ఖడ్గమృగానివి.





# మాయాసరోవరం

## 12

[ఆశ్వికభటుల ద్వారా జయశీలుడికి, మంత్రి ధర్మమిత్రుడు కొండచెరువు దగ్గిర విడిది చేసినట్టు తెలిసింది. మకరకేతును అతడు అక్కడికి తీసుకు వెళ్ళాడు. తనకెలాగూ చావు తప్పదని భయపడిన మకరకేతు, జలగ్రహానికి నీరు పెట్టే నెపంమీద, దాన్ని కొండచెరువు లోకి తీసుకుపోయి, జయశీలుడూ, సిద్ధసాధకులతో పాటు నీళ్లలో మునిగాడు. తరవాత—]

జలగ్రహం హఠాత్తుగా నీట మునగటమే గాక, నీటి అడుగున వేగంగా కదలటంతో, జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ, దానిమీది నుంచి పైకి తేలే అవకాశం లేకుండా పోయింది. ఆ ఇద్దరూ తమకు జలగండం సంప్రాప్తించిందనుకున్నారు. సిద్ధసాధకుడు, తనకు చావు సమీపించిందని, "జై, మహాకాళా!" అంటూ తను ఆరాధించే దైవాన్ని తలుచుకున్నాడు.

ఆ కేక జయశీలుడికి స్పష్టంగా వినిపించింది. తన ముందున్న మకరకేతు కూడా కనిపిస్తున్నాడు! అంటే నీటి అడుగున తను చూడగలుగుతున్నాడు; ధ్వనులు వినగలుగుతున్నాడు. ఏమిటీ చిత్రం?

జయశీలుడు మతిపోయిన వాడిలా చప్పున మకరకేతు భుజం పట్టుకుని, "ఒరే, దుర్మార్గుడా! నువ్వు చేసిన



13



పనేమిటి? నిన్ను కావాలంటే ఎప్పుడో ప్రాణాలు తీసివుండేవాళ్ళం. అయినా అలా చేయలేదు. అందుకు ప్రతిఫలంగా మమ్మల్ని నీటముంచి చంపదలిచావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు మకరకేతు బిగ్గరగా నవ్వి, ''అబ్బా!'' అంటూ పొట్టపట్టుకుని, ''జయశీలా, నీ కేమన్నా మతి చాంచల్యం కలగలేదు గదా? మనం యిప్పుడు తాడిప్రమాణంగల చెరువు నీటి అడుగున వున్నాం. మామూలుగా మనిషి అయినవాడు యింతలోతు నీటి అడుగున గాలి పీల్చగలడా? మాట్లాడగలడా? చూడగలడా?'' అని ప్రశ్నించాడు.

''అవును, జయశీలా, ఏమిటీ వింత! ఇదంతా ఆ మహాకాళుడి దయ,'' అంటూ సిద్ధసాధకుడు చుట్టూ కలయచూశాడు.

ఆ కొండ చెరువు అడుగున వున్న అనేక నీటిప్రాణులు వాళ్ళపక్కనుంచే ఈదుకుపోతున్నవి. వాటిలో పెద్ద పెద్ద చేపలు, మొసళ్ళు, పొడవాటి సర్పాలు- ఇలా అనేక జంతువులు వాళ్ళకంట బడినై. జలగ్రహం మాత్రం తల ఎత్తి సూటిగా ముందుకు దూసుకుపోతున్నది. ఎదురుగా ఒక చోట నీటి అడుగున వున్న పెద్ద కొండగుహలోంచి, నీరు మహా వేగంగా, ఉరవడితో వచ్చి పడుతున్నది.

మకరకేతు, ''జలగ్రహా!'' అని ఒక సారి తన వాహనాన్ని హెచ్చరించి, ''జయశీలా, సిద్ధసాధకా! మాట్టాడ రేం, ఆలోచిస్తున్నారా? నీటి అడుగున వుండీ, మీ యిద్దరూ ప్రాణాలతో వుండటానికి కారణం అర్థమైందా?'' అన్నాడు.

జయశీలుడు కత్తి దూసి, ''ఆc, అర్థమైంది! నిన్నూ, నీ జలగ్రహాన్నీ అంటిపెట్టుకు వున్నంత వరకూ, మాబోటి మనుషులకూ్కడా నీటిలో గాలి పీల్చుతూ బతగ్గలిగిన శక్తి వుంటుందన్న మాట!'' అన్నాడు.

''బాగా గ్రహించావు! మరి కత్తి దూశావెందుకు?'' అన్నాడు మకరకేతు.

"నీ తల నరకటానికి! ముందు జలగ్రహాన్ని నీటిపైకి తీసుకుపోతావా, లేదా?" అన్నాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు తన చేతిలో వున్న శూలాన్ని ఎత్తి, "జై, మహాకాళా! నీటి అడుగున మహాకాళుడికి, ఏ ప్రాణినీ బలియిచ్చిన భక్తుడు యీనాటివరకూ లోకంలో వుంటాడనుకోను. ఆ మహదవకాశాన్ని నాకు కలిగించు, జయశీలా!" అంటూ, శూలాన్ని మకరకేతు పీకకు ఆనించాడు.

మకరకేతు నవ్వబోయి, శూలం మొన గుచ్చుకోవటంతో, చేత్తో దాన్ని కాస్త పక్కకు నెట్టి, "మహావీరుడికీ, మహాకాలుడి భక్తుడికీ—ఇద్దరికీ మతులు పోయినై. నేను ఏ పరిస్థితుల్లోనూ జలగ్రహాన్ని నీటిపైకి నడిపి, తిరిగి మీకు బందీని కాను. బహుశా, మీ ఆజ్ఞ పాటించనందుకు మీరు, నా తల నరుకుతారు. ఆ మరుక్షణం మీ ఇద్దరికీ నీటిలో బతగ్గలిగిన శక్తి పోయింది. నలభై యాభై అడుగుల లోతున్న యీ నీటి అడుగు నుంచి మీరు ప్రాణాలతో పైకి తేలలేరు. బహుశా, ఆ తేలేవి మీ యిద్దరి శవాలు మాత్రమే!" అన్నాడు.

జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ అతడి మాటల్లోని సత్యం అర్థంకాగానే, యిప్పుడు తాము మకరకేతుడికి బందీలమన్న వాస్తవం తెలిసి, భయంకలిగింది. కాని, చేయగలిగిందేమీ లేదు. జలగ్రహం కొండ





పోయి, కొండ మీది జలాశయం చేర గానే—అక్కణ్ణించి మీ దారిన మీరు పోవచ్చు.'' అన్నాడు.

మకరకేతు మాట ముగించే లోపలే జలగ్రహం గుహ నీటిలో ప్రవేశించింది. ఇప్పుడు అంతా చీకటి. జయశీలుడు తాను ఏనుగు మీది నుంచి జారి, నీటిలో పడి కొట్టుకుపోకుండా, మకరకేతు నడుం పట్టుకున్నాడు. సిద్ధసాధకుడు, '' హా, మహాకాళా, నువ్వే రక్ష!'' అంటూ జయశీలుడి నడుం ఒడిసి పట్టుకున్నాడు.

నాలుగైదు క్షణాలకాలం గడిచీ గడవక ముందే జలగ్రహం కొండ మీది జలాశయాన్ని చేరింది. మకరకేతు ఆజ్ఞాపించ గానే అది అక్కడ నీటిమీదికి తేలి, తొండం ఎత్తి పెద్దగా ఘీంకరించింది.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒకసారి గట్టిగా గాలి పీల్చుకుని, ప్రాణాలతో బయటపడినందుకు సంతోషిస్తూ చుట్టూ కలయజూశారు. చుట్టూ ఎత్తుగా వున్న కొండ; మధ్య వున్న పల్లంలో నీరు. ఆ నీటిలోంచి ఒక పాయ కొండకు మరో వైపు నుంచి, వేగంగా ప్రవహించి పోతున్నది.

ఇదంతా చూసిన జయశీలుడికి చప్పున ఒక అనుమానం వచ్చింది. మకరకేతు మధ్య మధ్య, 'సరోవరేశ్వరా!' అంటూ అరుస్తూండేవాడు. ఆ సరోవరం యిదేనా?

గుహ లోంచి వేగంగా బయిటికి వస్తున్న నీటి కేసి పోసాగింది.

'' మకరకేతా! మా ఇద్దర్నీ బందీలుగా పట్టుకుని ఎక్కడికి తీసుకుపోతున్నావు?'' అని అడిగాడు జయశీలుడు.

మకరకేతు జవాబు చెప్పబోయేంతలో ఒక పెద్ద మొసలి, ఒక చేపను తరుము కుంటూ వాళ్ళకేసి వచ్చింది. జయశీలుడు కత్తి దూసి మొసలిని పొడవబోయేంతలో మకరకేతు దానితోక పట్టుకుని కిందికీ మీదికీ గట్టిగా ఊపి, దూరంగా విసిరివేసి, ''జయశీలా, మీ యిద్దరూ నాకు బందీలు కారు; నేనూ మీకు బందీని కాను. అదుగో, ఆ కనబడే గుహ నీటినుంచి జలగ్రహం



అతననే సరోవరేశ్వరుడు యిక్కడే వుంటాడా ?

జయశీలుడు యీ ప్రశ్న అడిగినప్పుడు మకరకేతు తల అడ్డంగా తిప్పి, "జయశీలా! నీ ఊహ తప్పు. మా రాజు సరోవరేశ్వరుడుండే, మాయా సరోవరం యిది కాదు. దాన్ని చూసిన మానవమాత్రులెవరూ ప్రాణాలతో యీ నాటి వరకూ, ఆ ప్రాంతాలను వదిలి రాలేదు," అన్నాడు.

"అయితే మమ్మల్ని అక్కడికి తీసుకుపోతున్నావా ?" అని అడిగాడు జయశీలుడు.

మకరకేతు నుంచి అవునన్న జవాబు వస్తే, అతణ్ణి శూలంతో పొడిచి చంపేందుకు సిద్ధసాధకుడు వెనకనుంచి అతడి వీపుకు శూలాన్ని గురిచేశాడు.

మకరకేతు అంతా గమనించీ ఏమాత్రం తొణక్కుండా, "మీ యిద్దరిదీ తొందరపాటు స్వభావం. అరణ్యంలో అనవసరంగా నన్ను పట్టుకుని, యింత గొడవకూ కారణం అయినవాళ్ళు మీరు! డొక్కలో వున్న కత్తికి తోడు, ఆ బోయవాడి చేత భుజంలో బాణం కూడా కొట్టించారు. మీకు ఈత వచ్చుగదా? అంత రాకపోతే, కొండ మీది చెట్లూ అవీ నీటి వేగానికి కొట్టుకువస్తున్నవి. వాటిల్లో దేన్నయినా పట్టుకుని ప్రాణాలు కాపాడుకోండి," అని తృటికాలం ఆగి, "జలగ్రహ !" అంటూ కేకపెట్టాడు.

జయశీలుడు రానున్న ప్రమాదాన్ని గుర్తించి, సిద్ధసాధకుణ్ణి హెచ్చరించాడు. ఏనుగు నీట మునుగుతూండగానే ఇద్దరూ చప్పున ఎగిరి ఈదుకుంటూ పోయి, నీటి వాలున పడి వస్తున్న ఒక పెద్ద చెట్టును పట్టుకున్నారు. వాళ్ళు నీట పడి లేస్తూ, దాని కొమ్మల మీదికి పోయేసరికి, చెట్టు బోదె మీద బోర్లా పడుకుని, ముందు కాళ్ళతో విరిగిన కొమ్మలను పట్టుకుని వున్న ఒక పెద్దపులి కంట బడింది.



వాళ్ళు పెద్దపులినీ, పులి వాళ్ళనూ ఒకేసారి చూడటం జరిగింది. పులి చ్రటున వెనక కాళ్ళమీద లేచి, పెద్దగా అరుస్తూ కొంచెం దగ్గిరలో వున్న సిద్ధ సాధకుడి మీదికి దూకబోయేదానిలా తోక ఆడించింది. సాధకుడు తన చేతిలోని శూలం ఎత్తబోయేంతలో జయశీలుడు అతణ్ణి వారించి, "సాధకా, జాగ్రత్త! అదీ మనలాగే నీటబడి ప్రాణం కాపాడుకునేందుకు యీ చెట్టుమీద చేరింది. శూలంతో పొడిచావో, మీద పడాలని చూస్తుంది. మీ ఇద్దరి కుమ్ములాటల్లో చెట్టు నీళ్ళల్లో మునిగిందంటే, అందరికీ నీటి గండమే!" అన్నాడు.

"అదీ నిజమే, కాని యీ రెచ్చిపోయిన పులి!" అంటూ సిద్ధసాధకుడు శూలాల్ని గురి చేసి, దాని ముఖం కేసి తీవ్రంగా చూస్తూ, "జయశీలా, నేను తల తిప్పితే పులి మీద పడుతుందేమో! విన్నావా? ఈ నీరు దాపులనే ఎక్కడో దిగువనున్న పల్లంలోనికి, జలపాతంలా పడుతున్నట్టున్నది," అన్నాడు.

జయశీలుడు ఆశ్చర్యం, భయం సమ్మిళితమైన గొంతుతో, "సాధకా, మనం జలపాతపు నీటిలో చిక్కుకుని, ఇంత ఎత్తునుంచి ఎక్కడో కిందికి పడబోతున్నాం. ఇంకొక రెండూ, మూడు వందల గజాల దూరం, అంతే!" అన్నాడు.

సిద్ధసాధకుడు భయవిహ్వలుడైపోయి, "మనం కిందపడి నజ్జునజ్జయిపోక ముందే చెట్టును వదిలితే?" అన్నాడు.

"చెట్టు ఆధారంవల్ల మనం బతికే అవకాశం వున్నది, వదలకు!" అన్నాడు జయశీలుడు.

అంతలో పెద్దపులి పెద్దగా గాండ్రించి, సిద్ధసాధకుడి మీదికి దూకబోయింది. ఆ సరికి నీటి వేగం హెచ్చి, చెట్టు జుయ్ఁ అంటూ పోయి జలపాతంలో చిక్కి, దాదాపు రెండువందల అడుగుల ఎత్తునుంచి, నీటితోపాటు కిందవున్న పల్లంలోకి పడింది.

తాము పట్టుకుని వున్న చెట్టు నీటిలో మునుగుతూ, తేలుతూ జలపాతం వెంట కిందికి పడుతూండగా, ఇవి తమకీ లోకంలో ఆఖరి క్షణాలనుకుంటూ జయశీలుడూ, సిద్ధసాధకుడూ గట్టిగా కళ్ళు మూసుకున్నారు. జలపాతం పడే చోట చిన్నా పెద్ద అనేకమైన కొండ రాళ్ళున్నవి. చెట్టు మధ్య భాగం అలాంటి కొండరాయి మీద పడి, చెట్టు రెండుగా విరిగింది. ఒక భాగం మీద జయశీలుడూ, రెండవ భాగం మీద సిద్ధసాధకుడూ, పులీ వున్నారు.

కొంతసేపటికి జయశీలుడు కళ్ళు తెరిచి చూశాడు. అతడిప్పుడు నీటి అంచున వున్నాడు. నడుమునుంచి దిగువ భాగం నీటితో తడుస్తున్నది. తల మాత్రం కొంచెం మిట్టప్రదేశాన వున్నది. దూరంగా జలపాతం ధ్వని వినిపిస్తున్నది.

''నేను బతికే వున్నానన్నమాట! కాళ్ళూ, చేతులూ సరిగా వున్నట్టా, విరిగినట్టా?'' అనుకుంటూ జయశీలుడు పక్కకు కదిలాడు. కుడి మోచేయి బాగా నొప్పి పెట్టింది. నిదానంగా కాళ్ళను కదిలించి చూశాడు; కొంచెం బాధ కలిగింది.

''అదృష్టవంతుణ్ణి! అంత ఎత్తునుంచి పడి ప్రాణాలు పోగొట్టుకోకపోవటమేగాక, కాళ్ళూ, చేతులూ విరక్కుండా బయట పడ్డాను,'' అనుకుంటూ జయశీలుడు లేచి నిలబడి, కాళ్ళకూ, చేతులకూ తగిలిన



చిన్న చిన్న గాయాల కేసి ఒకసారి చూసుకుని, ఒరలో కత్తిని సవరించుకుని, హఠాత్తుగా సిద్ధసాధకుడు జ్ఞాపకం రాగా, "సాధకుడెక్కడ?" అంటూ ప్రవాహం కేసి చూశాడు.

ప్రవాహం మధ్య అక్కడక్కడా చిన్నా, పెద్ద గండ రాళ్ళు చాలా వున్నవి. జయశీలుడు జలపాతం వెంట కిందపడిన చెట్టు భాగం, రెండు పెద్దరాళ్ళ మధ్య చిక్కుకుని వున్నది. కొంచెం దిగువగా విరిగిన రెండవ భాగం ఒడ్డుకుపట్టి వున్నది. కాని, సిద్ధసాధకుడు మాత్రం కనిపించలేదు.

"సాధకుడు దురదృష్టవంతుడు! జలపాతంలోంచి కిందపడుతూనే, ఏ రాయికో కొట్టుకుని చనిపోయి వుంటాడు. శవం నదీ ప్రవాహంతో కొట్టుకుపోయి వుంటుంది," అనుకున్నాడు జయశీలుడు.

వెంటనే అతడికి ఎన్నో రోజులుగా తనకు మిత్రుడై కష్టాల్లో భాగం పంచుకున్న సాధకుడి మీద ఎంతో జాలి కలిగింది. సాధకుడి శవం నీళ్ళల్లో నాని, ఏ మొసళ్ళకో ఆహారం కాకముందే, దాన్ని వెతికి పట్టుకుని, తగిన విధంగా దహన సంస్కారం చేయాలనుకున్నాడు జయశీలుడు.

అతడు చప్పున కదిలి నది ఒడ్డున అల్లిబిల్లిగా పెరిగిన చిన్న చిన్న పొదల మధ్యగా దారి చేసుకుంటూ కొంతదూరం పోయేసరికి, హఠాత్తుగా పెద్దపులి అరుపు వినిపించింది. జయశీలుడికి జలపాతంలో చిక్కుకున్న పులి గుర్తుకువచ్చింది.

"సాధకుడు పులికి ఆహారం కాలేదు గదా?" అనుకుంటూ జయశీలుడు చప్పున కత్తి దూసి, ఆ ధ్వని వచ్చిన వైపుకు గబగబా నడిచాడు.

ఒకచోట సిద్ధసాధకుడు కదలా మెదలక నీటి ఒడ్డున పడివున్నాడు. వెనక కాళ్ళు రెండూ రాళ్ళ దెబ్బలకు విరిగిపోయిన పులి, చిన్నగా గాండ్రిస్తూ, ముందు కాళ్ళమీద పాకుతూ, సాధకుణ్ణి సమీపిస్తున్నది. —(ఇంకావుంది)





# మాయాసుధీరుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ఆశయం తేలికగా సిద్ధించక పోవటానికి కారణం నీకు మానవాతీత శక్తులు లేకపోవటమే ననుకున్నట్టయితే అది భ్రమ అనుకో. అతీత శక్తులతో ఆశయ సిద్ధి జరగదనటానికి నీకు మైత్రేయుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఉజ్జయినీ నగరంలో సుధీరుడనే రాజు పాలించే కాలంలో అతని ఆస్థానంలో వీరదాసు అనే గొప్ప శిల్పి ఉండేవాడు. మైత్రేయుడని అతనికి ఒక తమ్ముడు ఉండేవాడు. ఈ మైత్రేయుడు హిమాలయాలలో చాలాకాలం తిరిగి, అనేక

## బేతాళ కథలు



మంది యోగసిద్ధిగల వారికి సేవచేసి, ఒక అద్భుతశక్తి సంపాదించుకుని వచ్చాడు. అతను సంపాదించిన అపూర్వ శక్తి ఏమంటే శిల్పాలకు ప్రాణం పొయ్యటం.

మైత్రేయుడు తన అద్భుతశక్తిని రాజు ఎదట ప్రదర్శించ గోరి, తన అన్న చేత రెండు స్త్రీ మూర్తులను తయారు చేయించి, నిండు సభలో ఆ రెండు స్త్రీ విగ్రహాలకూ ప్రాణం పోశాడు. అది చూసి, రాజుతోబాటు సభలోని వారంతా దిగ్భ్రమ చెందారు. సుధీరమహారాజు మైత్రేయుణ్ణి ఎంతగానో మెచ్చుకుని, అతణ్ణి తన ఆస్థానంలో ఉండి పొమ్మని కోరాడు. మైత్రేయుడు అందుకు సమ్మతించాడు.

కాలక్రమాన సుధీరుడికీ, మైత్రేయుడికీ గాఢమైన స్నేహం ఏర్పడింది. ఒక సారి సుధీరుడికి తన ప్రతిరూపాన్ని సజీవంగా చూడాలన్న కోరిక కలిగింది. అతను తన కోరికను మైత్రేయుడికి తెలిపితే, మైత్రేయుడు అతని కోరిక తీర్చటానికి సమ్మతించాడు.

మైత్రేయుడు తన అన్న వీరదాసు చేత సుధీరుడి ప్రతిమ రాతిలో నిర్దుష్టంగా తయారుచేయించి, దానికి తన ఇంటనే ప్రాణం పోసి, అర్ధరాత్రివేళ ఆ మాయా సుధీరుణ్ణి వెంట బెట్టుకుని రాజభవనానికి బయలుదేరాడు.

అన్నిదేశాల రాజధానులలో లాగే ఉజ్జయినిలో కూడా శత్రుగూఢచారులు ఉండేవారు. మాయాసుధీరుణ్ణి చూసి రాజే అనుకుని కొందరు శత్రుగూఢ చారులు అతని పైనపడి చంపి, పారి పోయారు. తెల్లవారే సరికల్లా, రాజును ఎవరో హత్యచేశారన్న వార్త నగరమంతా పాక్కింది.

అయితే హత్య అయినది మాయా సుధీరుడనీ, అసలు సుధీరుడు కాడనీ ప్రకటన జరిగింది. ప్రజలు తృప్తి పడ్డారు. కాని రాజ్యంలోని దుష్టశక్తులు ఆ సంఘట

నను అలా పోనియ్యలేదు. హత్య అయినది రాజేననీ, రాజునంటూ వ్యవహరిస్తున్నదే మాయాసుధీరుడనీ ఆ మాయాసుధీరుణ్ణి అడ్డం పెట్టుకుని మైత్రేయుడే రాజ్యం పాలిస్తున్నాడనీ ద్రోహులు వదంతి పుట్టించారు. రాజుకూ, మైత్రేయుడికీగల గాఢమైన స్నేహం మూలంగా ఈ వదంతి ప్రజలకు నమ్మదగినదిగా కనబడింది.

మామూలు జనం ఈమాట నమ్మటంలో వింతలేదు; అంతఃపురంలో రాణుల దగ్గిర నుంచీ, దాసదాసీ జనాలదాకా అందరూ సుధీరుడు మాయాసుధీరుడేమో నన్న సంశయంతో బాధపడసాగారు.

తన పరిస్థితి ఎలా పరిణమించినదీ సుధీరుడు సులువుగానే గ్రహించి చాలా బాధపడ్డాడు. ఈ సమస్యకు పరిష్కారం ఉన్నట్టు అతనికి తోచలేదు. అందుచేత అతను మైత్రేయుణ్ణే ఏదన్నా పరిష్కార మార్గం చూడమన్నాడు. మైత్రేయుడు కూడా ఈ విషయం ఆలోచిస్తూనే ఉన్నాడు. అతనికి ఒకే ఒక ఉపాయం తోచింది.

మైత్రేయుడు తన అన్న చేత తనలాటి విగ్రహం తయారుచేయించి, దానికి ప్రాణం పోసి, ఆ నకిలీ మైత్రేయుణ్ణి వెంట బెట్టుకుని, ఒక రాత్రి రహస్యంగా రాజు వద్దకు వెళ్ళాడు.



సుధీరుడు ఇద్దరు మైత్రేయులను చూసి నిర్ఘాంతపోయి, "మీలో అసలు మైత్రేయుడెవరు? నాకు అంతుబట్టకుండా ఉన్నది," అన్నాడు.

"మహారాజా, నేను అసలు మైత్రేయుణ్ణి. ఇతను నకిలీ మైత్రేయుడు. మీరు నిండు కొలువులో ఈ నకిలీ మైత్రేయుడి మీద రాజద్రోహనేరం మోపి, ఉరితీయించండి. పరిస్థితి చక్కబడుతుంది," అన్నాడు మైత్రేయుడు.

"మరి నీ సంగతి?" అని సుధీరుడు అడిగాడు.

"నేను ఎవరికంటా పడకుండా హిమాలయాలకు తిరిగి పోయి, అజ్ఞాత

జీవితం గడుపుతాను. మీ మీద ప్రజలందరికీ ఏర్పడిన అనుమానం తొలగిపోతుంది,'' అన్నాడు మైత్రేయుడు.

ఆ రాత్రే మైత్రేయుడు రాజు వద్ద సెలవు పుచ్చుకుని హిమాలయాలకు వెళ్లిపోయాడు. మర్నాడు ఉదయం సుధీరుడు నిండు సభలో నకిలీ మైత్రేయుడి మీద రాజద్రోహ నేరం మోపి, ఉరిశిక్షవిధించాడు. నకిలీ మైత్రేయుణ్ణి ఉరితీసినప్పుడు చూడటానికి ప్రజలు వేల సంఖ్యలో వధ్యస్థానానికి వచ్చారు. రాజునని చెప్పుకుంటున్న వాడు మాయా సుధీరుడు కాడని అందరికీ నమ్మకం కుదిరింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''మైత్రేయుడు చేసిన పని సరి అయినదే ననటానికి సందేహం లేదు. కాని అతనిలో ఉండిన అతీతశక్తి అలాటి దుష్ఫలితాలు ఇయ్యటానికీ, చివరకు అతను జీవన్మృతుడుగా హిమాలయాలలో జీవితం గడపవలసి రావటానికీ కారణం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''అలౌకిక మానవాతీత శక్తులు లౌకిక జీవితానికి ఎలా పనికివస్తాయో ఎవరూ చెప్పలేరు. వాటిఫలితాల మీద మనుషులకు ఎలాటి అధికారమూ ఉండదు. విగ్రహాలకు ప్రాణం పోయటం మాత్రమే తెలిసిన మైత్రేయుడు లౌకిక జీవితంలో రాణించే అర్హతగలవాడని చెప్పటానికి లేదు. అతనికి ఊరూ పేరూ లేని బతుకుతప్ప మరొకటి ఉండటానికి వీల్లేదు. ఆ సంగతి అతని అసాధారణ శక్తి చాటున వెంటనే స్పష్టంకాలేదు. ఆ శక్తివల్ల దుష్ఫలితాలు కలిగినాకనే అది స్పష్టమైంది. మైత్రేయుడు. హిమాలయాలకు తిరిగి పోవటం చాలా సహజం,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ఎక్కువ ప్రియమైనది

ఇంద్రసేన నగరాన్ని చంద్రసేనుడు పాలించేకాలంలో శివశర్మ అనే సమర్థుడైన కవి ఆస్థాన కవిగా ఉండేవాడు.

ఆ రాజ్యంలో వసంతనవరాత్రులు ఘనంగా జరిగేవి. దేశదేశాల నుంచీ కవులూ, గాయకులూ, కళాకారులూ ఇంద్రసేననగరానికి వచ్చి, తమ కళాప్రావీణ్యం ప్రదర్శించి, సన్మానాలు పొందేవారు. ఒక ఏడు ఈ సన్మానాలు పూర్తి అయాయి. శివశర్మ కూడా గొప్ప సన్మానం పొందాడు.

ఈ తంతు ముగియగానే వచ్చిన బ్రాహ్మణుల కందరికీ సంతర్పణా, దొడ్డిసంభావనా జరుగుతున్నది. శివశర్మ అక్కడికి వెళ్ళాడు. సంభావన జరిగేచోట తొక్కిడి జాస్తిగా ఉన్నది. తోసుకువచ్చే బ్రాహ్మణులను అదుపులో ఉంచలేక రాజభటులు సతమతమవుతున్నారు. ఆ తొక్కిడిలో శివశర్మ బురదనేల మీద కాలుజారి పడ్డాడు. ఒళ్ళంతా బురద అయింది.

మేడ మీదినుంచి చూస్తున్న రాజుగారు శివశర్మను పిలిపించి, "ఏమిటిది?" అని అడిగాడు. దానికి శివశర్మ ఈ శ్లోకం చెప్పాడు:

"క్షుత్తృడాశాః కుటుంబిన్యో మయి జీవతి నాన్యగాః,
తాసా మంత్యా ప్రియతమా, తస్యా శృంగారచేష్టితమ్."

[నాకు ఆకలీ, దప్పి, ఆశా అని ముగ్గురు భార్యలున్నారు. వారిలో మూడవ ఆమె నాకు ఎక్కువ ప్రియమైనది. ఇది ఆమె చేసిన శృంగార చేష్ట.] —యామినీ సరస్వతి





# వ్యాపారం

గీతాపురం కోడిగుడ్లకు ఎంతో ప్రసిద్ధి. ఆ గ్రామంలో చాలామంది రైతులు వ్యవసాయంతోబాటు కోళ్ళ పెంపకం కూడా చేసి, అదనంగా రాబడి సంపాదించేవారు. గుడ్లు పెద్దవిగానూ, రుచిగానూ ఉండి, మంచి రాబడినిచ్చేవి.

అయితే ఆకస్మికంగా కోళ్ళు అధిక సంఖ్యలో చావటం ఆరంభమై, త్వరలోనే గ్రామంలో ఒక్క కోడి కూడా లేకుండా పోయింది. దీనానాథ్ అనేవాడి పెంపకంలో వున్న అయిదువందల కోళ్ళలో ఒక్కటీ దక్కలేదు.

"ఇదేదో గాలిచేష్ట. మన కోళ్ళను పిశాచాలు పట్టుకుపోయాయి. ఆ పిశాచాలను మారణహోమం చేస్తేగాని మన కోళ్ళు బతకవు. లేకపోతే మన కోళ్ళ గతే మనకూ పట్టుతుంది," అన్నాడు దీనానాథ్.

ఈ మాట మిగిలిన రైతులకు సబబుగా తోచింది. పక్కగ్రామంలో ఒక భూతవైద్యుడున్నాడు. అందరూ కలిసి చందాలు వేసుకుని, ఆ భూతవైద్యుణ్ణి పిలిపించి, పిశాచాల బెడద వదిలించుకోవటానికి నిర్ణయం జరిగింది.

ఒక శనివారం సాయంత్రం భూతవైద్యుడు తన శిష్యులతోసహా వచ్చి, పిశాచాలను వదలగొట్టే తంతు అంతా జరిపి, గ్రామస్థులు పెట్టిన భోజనం దండిగా మెక్కి, డబ్బు కూడా దండిగానే పుచ్చుకుని, "ఇక మీకు పిశాచాల పీడ వుండదు," అని వెళ్ళిపోయాడు.

ఇక భయంలేదనుకుని గ్రామంలోని రైతులు మళ్ళీ కోళ్ళుకొని, కోడిగుడ్ల వ్యాపారం తిరిగి ప్రారంభించారు. కాని వారం తిరిగేలోపల, రోగాలతో కోళ్ళన్నీ చచ్చాయి.

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

"ఎందుకొచ్చిన కోళ్ళవ్యాపారంరా? మన వ్యవసాయమేదో మనం చూసు కుందాం. మనకేదో తిరుగులేని శాపం తగిలింది," అన్నాడు దీనానాథ్ మిగిలిన రైతులతో.

ఆ విధంగా గీతాపురపు కోడిగుడ్లు మచ్చుకైనా కనిపించకుండా పోయాయి. రైతులు తమ విశ్రాంతి కాలంలో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నారు.

గీతాపురానికి చెందిన ఒక భూస్వామి కొడుకు శంకర్, శలవులకు ఇంటికి వచ్చాడు. కిందటి సారి అతను ఇంటికి వచ్చినప్పుడు ఏపూటా గుడ్డులేకుండా భోజనం చెయ్యలేదు. ఈసారి మూడు రోజులు గడిచినా అతని భోజనంలో కోడిగుడ్డు ఏరూపంలోనూ ప్రత్యక్షం కాలేదు.

అతను వాళ్ళ అమ్మను అడిగితే, శాపం తగిలీ, పిశాచాలు ఆవహించీ కోళ్ళన్నీ చచ్చాయని చెప్పింది. కోడి గుడ్ల వ్యాపారం గ్రామంలోని రైతులకు ఎంతగా లాభించినదీ శంకర్ ఎరుగును. అతను గ్రామంలో ఎలాగైనా కోడిగుడ్ల వ్యాపారం పునఃప్రతిష్ఠ చెయ్యాలనుకున్నాడు. అసలే దేశంలో ఆహారకొరత చాలా హెచ్చుగా ఉన్నది. మాంసకృత్తుల మాట చెప్పనే అవసరం లేదు. అందుచేత ఆహారోత్పత్తి మందగించనియ్యరాదు.

మర్నాడు ఉదయమే శంకర్ దీనానాథ్ ఇంటికి వెళ్ళి, కోళ్ళు ఏదో అంటువ్యాధి






గురించి కూడా నాకు రాశాడు. అప్పుడు నేనొక సిద్ధుడి వద్దకు వెళ్ళి, ఆయన దర్శనం చేసుకొని, విషయమంతా చెప్పాను. ఆయన పేరు గంభీరానంద మహారాజ్. ఆయన నాకు ఒక తాయెత్తు ప్రసాదించి, కోడిగుడ్ల మీద దానికి అద్భుతమైన ప్రభావం ఉంటుందని చెప్పాడు. దాని ప్రభావం మీరు కూడా చూడవచ్చు. మీకు నమ్మకం కలగటానికి నేనే కోళ్ళ వ్యాపారం ప్రారంభించి, శాపాన్ని ఎలా తప్పించుకోవచ్చునో చూపుతాను. తాయెత్తు ప్రభావం ఎప్పుడు చూపమంటారు?'' అన్నాడు.

''రేపు మధ్యాన్నం దాటినాక ఇక్కడే మా ఇంట్లోనే చూపించు. చూడటానికి రైతులందర్నీ పిలుస్తాను,'' అన్నాడు దీనానాథ్.

మర్నాడు అపరాహ్ణం శంకర్ దీనానాథ్ ఇంటికి వెళ్ళాడు. అక్కడ చాలా మంది గ్రామస్థులు చేరి ఉన్నారు. శంకర్ తన జేబు నుంచి ఒక రాగిరేకు తాయెత్తు తీసి, ఎత్తు పీట మీద ఉంచాడు. తరవాత అతను ఇంకో జేబు నుంచి చేతిరుమాలు తీసి, ఎడమ అరిచేతి మీద పరిచి, కుడి చేత్తో జేబు నుంచి ఒక కోడిగుడ్డు తీసి ఎడమ అరిచేతిలో ఉంచి, దాన్ని చేతిరుమాలులో కప్పాడు. తరవాత అతను

సోకి చచ్చాయిగాని, శాపాలూ, పిశాచాలూ ఏమీ కాదని అతనికి నచ్చజెప్పటానికి ఎంతగానో ప్రయత్నించాడు. కాని రైతుల మూఢ విశ్వాసాలూ, నమ్మకాలూ ఒకంతట వదిలేవి కావు.

బస్తీలో ఉంటూ తాను నేర్చుకున్న ఇంద్రజాలం ప్రయోగించి, ప్రజల మూఢ విశ్వాసాన్ని జయించాలని శంకర్ నిశ్చయించాడు.

అతను గ్రామస్థులతో, ''నేను ఎక్కువ కాలం పట్టణంలో ఉంటాను గద, అక్కడ దేవాలయాలలో గొప్ప బైరాగులూ, సిద్ధులూ ఉంటారు. మా నాన్న ఊరి విశేషాలు రాస్తూ మీకు జరిగిన అన్యాయం

తాయెత్తు తీసుకుని, దాన్ని కుడిచేత్తో చేతిరుమాలు లోపల ప్రవేశపెట్టి, దాంతో ఏదో చేసి తిరిగి తాయెత్తును బయటికి తీశాడు. అతను కొద్దిక్షణాలు ఆగి, చేతిరుమాలు కొసలు తొలగించాడు. అతని ఎడమచేతిలో రెండు గుడ్లు ఉండటం చూసి, ఆశ్చర్యంతో గ్రామస్థుల కళ్ళు వెళ్ళుకొచ్చాయి!

శంకర్ రెండు గుడ్లనూ చేతి గుడ్డలో చుట్టి జేబులో పెట్టుకుని, తాయెత్తును తీసి కళ్ళకద్దుకుని, ఎర్రదారంతో తన జబ్బకు కట్టుకున్నాడు.

ముందుగా అతను పట్నానికి వెళ్ళి, ప్రభుత్వ పశుపోషణశాఖ అధికారులతో మాట్లాడి, కోళ్ళనిపుణుల సలహా, సహకారాలుపొంది, కోళ్ళపెంకం మీద పుస్తకాలూ, మందులూ, వగయిరా కొన్నాడు. వాటిని వాడే పద్ధతి నేర్చుకున్నాడు. రెండు రోజులలో అతను ఎన్నోవిషయాలు తెలుసుకుని, దీనానాథ్ ఇంట ప్రదర్శన చేసేలోపల గుడ్లను రెట్టింపు చేసేవైనం కూడా తెలుసుకున్నాడు.

ఒక పెద్దగుడ్డు గుల్లను సంపాదించి దాన్ని నిలువుగా రెండు సమభాగాలుగా కొయ్యాలి. సగం గుల్లలో చిన్నకోడి గుడ్డు సులువుగా ఇముడుతుంది. ఇలా ఇమిడ్చిన గుడ్డును శంకర్ ప్రదర్శనకు ఉపయోగించాడు. అతను ప్రేక్షకులకు గుల్ల పైభాగం మాత్రమే చూపి, చేతిగుడ్డ చాటున చిన్నగుడ్డును గుల్ల నుంచి వేరు



చేశాడు. కొంతదూరం నుంచి చూసే వారికి గుల్లకూడా పూర్తి గుడ్డులాగే కనబడుతుంది.

తన ఇంద్రజాలం పారగానే శంకర్ మిగిలిన కార్యక్రమం చేపట్టాడు. అతను కొన్ని కోళ్ళను కొని పెంచనారంభించాడు. ప్రభుత్వం వారు సరఫరా చేసే మేలు రకం ఆహారం వాటికి పెట్టాడు. అంటు వ్యాధులు సోకకుండా వాటికి సూది మందులూ అవీ ఇచ్చాడు. కోళ్ళు బాగా పెరిగి, పెద్దపెద్ద గుడ్లుపెట్టాయి. ఒక్క కోడి కూడా చావలేదు. గ్రామస్థులు రోజూ వచ్చి అతని కోళ్ళ పరిశ్రమను చూసి పోయేవారు. మూడు వారాలు ముగిసేసరికి శంకర్ కోళ్లవ్యాపారం అద్భుతంగా రూపొందింది.

"అంతా నా తాయెత్తు చలవ, దీనూ మామా! తాయెత్తు పైఎత్తున కాపాడింది. ప్రత్యేకమైన ఆహారం కోళ్ళను బలవపెట్టింది. ఇంజెక్షన్లు పుష్టినిచ్చాయి. మీరేమీ భయపడవద్దు. మళ్ళీ కోళ్ళ వ్యవసాయం సాగించి, గీతాపురం కోడి గుడ్లను మళ్ళీ అమ్మకానికి పెట్టండి. సిద్ధులవారి నడిగి ఇంకా తాయెత్తులు తెస్తాను. నేనిక్కడ ఉన్నన్నాళ్ళూ నా తాయెత్తు ఉండనే ఉంటుంది. ప్రతి రోజూ ప్రతి ఇంటికీ వచ్చి, మీ కోళ్ళకు అపాయం లేకుండా చూస్తాను," అన్నాడు శంకర్.

శంకర్ ఇచ్చిన ప్రోత్సాహంతో రైతులు కొత్తగా కోళ్ళు కొన్నారు. శంకర్ వాటికి కావలిసిన ఆహరమూ, మందులూ ఏర్పాటు చేశాడు. వాటిని తానే స్వయంగా ఇచ్చాడు. కోళ్ళు ఏపుగా పెరిగి, పెద్దపెద్ద గుడ్లుపెట్టాయి. మళ్ళీ గీతాపురం కోడి గుడ్లు మార్కెట్‌లోకి విరివిగా వచ్చాయి. రైతులు లోగడకన్న బాగా సంపాదించారు.

తరవాత శంకర్ పశుపోషణలో ప్రత్యేక శిక్షణపొంది, తన గ్రామానికి తిరిగి వచ్చి, అక్కడ ఉండే కోళ్ళ వ్యవసాయాన్ని కనిపెట్టి ఉన్నాడు.





# బతకనేర్చినవాడు

చంద్రవర్మ పాలించే రాజ్యంలో ఆయన సభామండపాన్ని ధర్మయ్య అనేవాడు కావలి కాసేవాడు. చంద్రవర్మ ఒకసారి అటుగా వచ్చి, ధర్మయ్యతో, ''నీ ఒక్కడికీ పని ఎక్కువై ఉంటుంది. మరొక భటుణ్ణి నీకు తోడుగా నియమిస్తాను,'' అన్నాడు.

"అక్కర్లేదు, ప్రభూ!" అని ధర్మయ్య అనేలోపుగా రాజు కదిలి వెళ్ళిపోయాడు.

ధర్మయ్య తనకు తోడు అవసరం లేదనుకోవటానికి కారణం ఉన్నది. రాజదర్శనం కోరివచ్చే వాళ్ళదగ్గిర ధర్మయ్య లంచాలు బాగా రాబట్టేవాడు. డబ్బు ఇచ్చుకోలేని వాళ్ళనుంచి కాయో, కూరో వసూలు చేసేవాడు. తనకు తోడుగా మరొకడు వస్తే వాడు లంచంలో భాగం అడగవచ్చు. లేదా తనమీద రాజుగారికి చెప్పవచ్చు.

మర్నాడు ధర్మయ్యకు తోడుగా మరొక కాపలావాడు వచ్చాడు. రాజదర్శనం కోసం వచ్చేవాళ్ళను ధర్మయ్య అవతలికి తీసుకుపోయి, తన మామూలు వసూలు చేసుకున్నాడు. ఇది చూసి రెండో భటుడు రాజుతో చెబుతానని ధర్మయ్యను బెదిరించాడు. ధర్మయ్య తన సంపాదనలో వాడికి వాటా ఇస్తానన్నాడు. వాడు ఒప్పుకోలేదు. వాడు నిజాయితీపరుడు. అదీగాక, ధర్మయ్య లంచాలు గుంజుతున్నాడని పసిగట్టే రాజు వాణ్ణి అదనంగా నియమించాడు.

తన తోటిభటుడు తనతో సహకరించడని రూఢి చేసుకుని, ధర్మయ్య రాజదర్శనం చేసుకోవటానికి వచ్చేవారితో, ''చూడండి, ధర్మప్రభువులు! నేను మీ దగ్గిర లంచం పట్టినట్టు వీడు రాజుగారితో చెబుతాడట. అతనే మిమ్మల్ని లంచం అడిగినట్టు నేను

ఎం. వి. వి. సత్యనారాయణ



ఫిర్యాదు చేస్తాను. మీరు సాక్ష్యం ఉంటారు గదా ?'' అన్నాడు.

ధర్మయ్య అక్కడ ఇరవై సంవత్స రాలుగా పాతుకుపోయిని మనిషి. పైగా, డబ్బు తిన్నప్పటికీ, అందరి పనులూ ఏదో రకంగా సానుకూలపరిచేవాడు. అతను అస్థానంలో లేకపోతే, తమ అవసరాలు తెలిసి, తమ పనులు చేసిపెట్టేవాడు దొరక్కపోవచ్చు. ఈ ఉద్దేశంతో ఆ వచ్చిన వాళ్ళు ధర్మయ్య పక్షాన సాక్ష్యం చెబుతా మన్నారు. దాంతో రెండోభటుడి ఆట కట్టింది. పైపెచ్చు, ధర్మయ్య వాడి మీద రాజుతో ఫిర్యాదు చెయ్యకుండా ఉండ గలందులకు ఆ రెండోభటుడు తన జీతంలో అయిదోవంతు ధర్మయ్యకు ఇచ్చుకోవలసి వచ్చింది!

రెండు నెలలు గడిచాయి. తన భర్త పూర్తిజీతం ఇంట్లో ఇవ్వడంలేదంటూ రెండోభటుడి భార్య రాజుతో విన్నవించు కున్నది. రాజు విచారించి అసలు సంగతి తెలుసుకుని, ధర్మయ్యను దివాణంలో గంటలుకొట్టే పనికి మార్చాడు.

రాజుగారి కార్యాలయాల్లో పనిచేసే ఉద్యోగస్తులను ధర్మయ్య కలిసి, కార్యాల యాలలో వాళ్ళు పనిచేసే కాలం త్వరగా గడిచేటట్టుచేస్తాననీ, అందుకుగాను తనకు కొంతలాభం కలిగించమనీ అన్నాడు. పని భారం ఎక్కువగా ఉన్న ఉద్యోగులు చాలా మంది అందుకు ఒప్పుకున్నారు. వాళ్ళే మిగిలినవారిచేత కూడా ఒప్పించారు. అది మొదలు ఉద్యోగులు కార్యాలయం పని పూర్తిచేసేటప్పటికి ఇంకా చాలా పొద్దు ఉండసాగింది.

నెలలు గడుస్తున్నాయి. ధర్మయ్య క్రమంగా కుబేరుడవుతున్నాడు. అతను నగరం మధ్యలో చక్కని స్థలం కొని, అందులో పెద్దభవనం కట్టించుకున్నాడు.

ఒకనాడు చంద్రవర్మతో ఆయన భార్య, పగలు చాలా త్వరగా గడుస్తున్నదనీ, సాయంకాలాలు ఎంతకీ గడవడంలేదనీ, తనకు ఇదంతా అయోమయంగా ఉన్నదనీ

అన్నది. చంద్రవర్మకు కూడా లీలగా అలాటి అనుమానమే కలిగి ఉండటంచేత, ఆయన మర్నాడు తన అంతఃపురంలోని ఇసుకగడియారం వద్ద కాపువేసుకుని కూర్చున్నాడు.

కార్యాలయాలలో పని ప్రారంభించే దాకా ధర్మయ్య కొట్టే గంటలు గడియారం చూపే కాలం ప్రకారమే ఉన్నాయి. కాని ఆ తరవాత ఇసుకగడియారంలో గంట పూర్తికాకుండానే ధర్మయ్య గంటకొడుతూ వచ్చాడు. సాయంకాలం కార్యాలయాలలో పని అయిపోయేవేళకు ఒకగంట తేడా వచ్చింది. అంటే కార్యాలయాల పని ముగించవలసినదానికి ఒకగంట ముందుగానే ముగుస్తున్నదన్నమాట!

చంద్రవర్మ ధర్మయ్యను సభకు రప్పించి, విచారణ జరిపి, అతను ఉద్యోగస్తులనుంచి లంచాలు వసూలు చేసినట్టు రుజువు చేశాడు. అయితే ఎన్నో ఏళ్ళుగా కొలువుచేస్తున్న ధర్మయ్యను నిరుద్యోగి చెయ్యడం రాజుకు సమ్మతంకాలేదు. అతన్ని ఎవరైనా కఠినుడైన అధికారి వద్ద ఉద్యోగానికి వేస్తే అతని ఆట కట్టవుతుందనుకున్నాడు రాజు.

చంద్రవర్మ వద్ద ఉండే సైన్యాధికారి కర్కోటకుడని ప్రతీతి. ఆయనకు సేవకుడుగా ధర్మయ్య నియమించబడ్డాడు.



ఈ కొత్త ఉద్యోగంలో ధర్మయ్య నిజాయితీగానే ఉంటూ, తన పనులు జాగ్రత్తగా చేసుకుపోయాడు.

ఒకనాడు సాయంత్రం ధర్మయ్య తోటలో మొక్కలకు నీళ్ళు పోస్తున్నాడు. తోటవేపు ఉన్న గదిలో సైన్యాధికారీ, ఆయనభార్యా ఏదోమాట్లాడుకుంటున్నారు. మామూలు సంభాషణ చప్పున కీచులాటగా మారింది. ధర్మయ్య చప్పున కిటికీ పక్కన చేరి ఆలకించాడు. సైన్యాధికారి బయట పులి అయినా, ఇంట్లో భార్య దగ్గిర పిల్లి. ఆయన భార్య కోపం పట్టలేక చప్పున చేతికి దొరికిన వస్తువు తీసుకుని తన భర్తను కొట్టింది.



సైన్యాధికారి ఎవరైనా చుశారేమోనని అటూ, ఇటూ చూసేసరికి, కిటికీలోనుంచి ధర్మయ్య తొంగిచూడటం కనబడింది. ఆయనకు తల కొట్టేసినట్టయింది. ఆయన భార్యను ఏమీ అనలేక, తోటలోకి వచ్చి, ధర్మయ్యను చీవాట్లు పెట్టాలని చూశాడు.

అయితే ధర్మయ్య చిరాకుపడుతూ, "చాల్లెండి, ధర్మప్రభువులు! ఎంత ప్రేమ ఉంటేమటుకు భార్యచేత కొట్టించుకుంటారా? ఈ సంగతి రాచనగరులో తెలిస్తే మీకు ఎంత నామర్దా!" అన్నాడు.

సైన్యాధికారికి ఈ మాట చురుక్కున తగిలింది. ఈ విషయం ఎక్కడా చెప్పవద్దని ఆయన ధర్మయ్యను బతిమాలాడు.

"అభ్యంతరం లేదు, బాబూ! కాని మహారాజుగారు నన్ను పిలిచి, 'ఏరా! సైన్యాధికారిగారి ఇల్లు నీకు ఎలా ఉంది?' అని అడిగితే, నిజం దాచగూడదు కదండీ?" అన్నాడు ధర్మయ్య.

సైన్యాధికారి ధర్మయ్యకు లంచం ఇయ్యక తప్పలేదు. అడపాదడపా ధర్మయ్య సైన్యాధికారి భార్య వద్ద కూడా లంచాలు పుచ్చుకునేవాడు. పులిలాటి సైన్యాధికారీ, ఆయన భార్యా ధర్మయ్య దగ్గిర పిల్లులలాగా అయిపోయినట్టు, ఇతర నౌకర్ల ద్వారా పుకారు బయలుదేరి, ఆ నోటా ఆ నోటా రాజు దాకా వెళ్ళింది.

రాజు ఆశ్చర్యపడి, ధర్మయ్యను రప్పించి సంగతి తెలుసుకుని, రహస్య సంభాషణలు విన్నందుకూ, ఒక అధికారిని పీడించినందుకూ ధర్మయ్యను పనిలోనుంచి తొలగించాడు. అప్పటికే బాగా సంపాదించి ఉండటం చేత ధర్మయ్య ఉద్యోగం పోయినందుకు విచారించలేదు.

పైపెచ్చు అతను నిరుద్యోగులుగా ఉన్న నలుగురు యువకులను చేరదీసి, కొద్దిపాటి జీతాల మీద వాళ్ళకు తానే ఉద్యోగం ఇచ్చాడు. వాళ్ళ పని ఏమంటే, నలుగురూ నాలుగు పేటలూ తిరిగి, తమకు వింతగా తోచిన సంఘటనలనూ,

మనుషులనూ గురించి తమ వద్ద ఉన్న పుస్తకాలలో రాసుకుని, వాటిని రాత్రి వేళ ధర్మయ్యకు చూపించాలి. వాళ్ళు రాసిన విషయాలను ప్రాధాన్యతను బట్టి ధర్మయ్య తన చితా పుస్తకంలో రాసుకునేవాడు.

అతని చితా పుస్తకం లోకోక్తి అయిపోయింది. ఎవరికీ తెలీని విషయాలను గురించి, "ధర్మయ్య చితా పుస్తకంలో దొరకవచ్చు," అని ప్రజలు అనేవారు.

ఆ ఏడాది దసరా ఉత్సవాలు నగరంలో వైభవంగా జరిగాయి. వాటిని చూడడానికి ఎక్కడెక్కడినుంచో జనం వచ్చారు. దూరప్రాంతపు రాజులు కూడా వచ్చి, ఉత్సవాలలో పాల్గొని, చంద్రవర్మకు అనేక లక్షలు చేసే వజ్రపుటుంగరాన్ని బహూకరించారు.

పదోరోజున దసరా ఉత్సవాలు ముగిశాయి. ఉత్సవాల సందడిలో చంద్రవర్మ తన వజ్రపుటుంగరాన్ని ఎక్కడో పారేసుకున్నాడు. దానికోసం భటులూ, రాజోద్యోగులూ వెతికి, వేసారిపోయి, "ఉంగరం జాడ ధర్మయ్య చితాలోనే దొరకాలి," అన్నారు.

కాలక్షేపం కోసం రాజు ధర్మయ్యను చితాపుస్తకంతో సహా తన వద్దకు పిలిపించుకున్నాడు.

"పదోనాటి ఉత్సవాలలో విశేషాలు ఏమైనా ఉన్నాయా?" అని రాజు ధర్మయ్యను అడిగాడు.



ధర్మయ్య తన చిఠా తెరిచి, "దక్షిణపు వీధిలో ఒక చెట్టుకు పట్టపుటేనుగు కట్టి వేసి ఉన్నది. మావటివాడు తొందరగా తన ఇంటి కేసి పరిగెట్టుతున్నాడు," అని చదివాడు.

రాజు ఆ వార్త తెలిపిన యువకుణ్ణి పిలిపించమని ధర్మయ్యను అడిగాడు. ఆ యువకుడు వచ్చి, రాజుగారి మావటి వాళ్ళందరిలోనూ తాను చూసినవాణ్ణి గుర్తుపట్టాడు.

"పట్టపుటేనుగును నడివీధిలో కట్టి, ఇంటికి ఎందుకు వెళ్ళావు ?" అని రాజు మావటివాణ్ణి అడిగాడు.

"ఇంటికి అవసరంగా వెళ్ళవలసి వచ్చింది, మహారాజా. ఆ రోజు మీరు మార్గమధ్యంలో ఏనుగును దిగి, కాలి నడకన ఉత్సవ జనంలోకి వెళ్ళారు. నా తప్పు కాయండి," అన్నాడు మావటి వాడు దీనంగా.

యువకుడు రాజుతో, "నిన్న ఈ మావటి వాణ్ణి వాడి భార్య పట్టుచీర కొనమనీ, ముత్యాలహారం చేయించమనీ అడగడం విన్నాను. అదికూడా చిఠాలో ఉంటుంది, చూడండి," అన్నాడు.

చిఠాలో అదీ ఉన్నది!

"నీకు అంత డబ్బు ఎలా వచ్చిందో చెబుతావా, ఉరితీయించమన్నావా ?" అన్నాడు రాజు మావటివాడితో.

మావటివాడు గడగడలాడుతూ, రాజు ఆ రోజు పట్టపుటేనుగును దిగే తొందరలో ఉంగరం జారిపోయిందనీ, దాన్ని చప్పున తాను తీసుకున్నాననీ, దాన్ని తెగనమ్మి తనకు ఖర్చుపెట్టమని తన భార్య అంటున్నదనీ బయటపెట్టాడు.

రాజుకు ఉంగరం దొరికింది. ధర్మయ్యనూ, అతని కుర్రాళ్ళనూ ఎలా ఉపయోగించాలో కూడా రాజుకు తెలిసింది. వాళ్ళను ఆయన గూఢచారులుగా నియమించి, వాళ్ళకు మంత్రిజీతంతో సమమైన జీతం ఇచ్చాడు. రాజులు గూఢచారులను నియమించడం అప్పటి నుంచే ఆరంభమయింది.





# పనికిరాని సలహాలు

ఊరి చివర ఉన్న శ్మశానంలో అనేక పిశాచాలుండేవి. వాటిలో అనుభవం జాస్తిగా గల ఒక వృద్ధపిశాచి, ఇతర పిశాచాలకు ఏ సమస్య ఏర్పడినా సలహాలు ఇస్తూండేది.

ఒక రోజు ఆ వృద్ధపిశాచి అడవిలో చాలా సేపు తిరిగి, ఒక పాడుబడిన దిగుడుబావి పైమెట్టు మీద కూర్చున్నది.

"ఎవరు వారు? నా స్థలంలో వచ్చి కూర్చున్నారు?" అన్న మాటలు విని వృద్ధపిశాచి తల ఎత్తి, ఒక ఆడపిశాచిని చూసి, "ఇది నీ చోటా? అయితేనేం? విశాలంగానే ఉన్నది గట్టు. నువు కూడా వచ్చి కూర్చో," అన్నది.

ఆడపిశాచి వృద్ధ పిశాచి పక్కన కూర్చున్నది.

"నేను ఇటుగా ఉన్న శ్మశానంలో ఉంటాను. పిశాచాలకు ఏ సమస్య వచ్చినా నన్ను సలహా అడుగుతూంటారు," అంటూ వృద్ధ పిశాచి తనను తాను ఆడ పిశాచికి పరిచయం చేసుకున్నది.

వెంటనే ఆడపిశాచి ఉత్సాహం వచ్చినట్టుగా కనబడి, "నాకూ ఒక సమస్య వచ్చి పడింది. బుర్ర బద్దలు కొట్టుకున్నప్పటికీ పరిష్కారం తోచటం లేదు. కాస్త సహాయం చెయ్యి," అన్నది.

వృద్ధ పిశాచికి అది తన సమస్యను ఇలా వివరించి చెప్పింది:

అది నివసించే మర్రిచెట్టుకు చాలా దగ్గిరగా ఒక పాడుబడిన ఇల్లు ఉన్నది. నెల క్రితం ఆ ఇంటిని ఒక సంగీతం మేస్టరు ఆక్రమించాడు. ఊళ్ళో నుంచి చాలామంది అబ్బాయిలూ, అమ్మాయిలూ అతడి వద్దకు వచ్చి, రోజంతా సంగీతం సాధన చేస్తారు. ఇంతకాలమూ ప్రశాంతంగా జీవిస్తున్న ఆడపిశాచికి ఈ గోల

ఎం. కామేశ్వరరావు



దుర్భరంగా ఉన్నది. ఎలాగైనా ఆ సంగీతం మేస్టర్ని ఆ ఇంటి నుంచి వెళ్ళగొట్టాలి. అదీ ఆడపిశాచి సమస్య.

అంతా విని వృద్ధ పిశాచి, "ఇదొక సమస్యా ఏమిటి? ఇంతకన్న ఎంతో కఠినమైన సమస్యలను పరిష్కరించాను. నువు ఇలా చేశావంటే నీ సమస్య తీరి పోతుంది," అంటూ ఆడపిశాచికి ఏదో సలహా ఇచ్చింది.

ఆడపిశాచి ఈ సలహాకు అమితంగా సంతోషించి, ఆ రాత్రే సంగీతం మేస్టరు ఇంటికిపోయి, గండుపిల్లిగా మారి, వికృతంగా అరుస్తూ, కిటికీలో నుంచి సంగీతం మేస్టరు గదిలోకి దూకింది.

ఈ గొడవతో సంగీతం మేస్టరు నిద్రలేచి, గండుపిల్లి కాస్తా పిశాచిగా మారడం చూసి, ధైర్యం కూడగట్టుకుని, "ఎవరు నువు? ఈ వేళప్పుడు ఇక్కడ నీ కేం పని?" అని అడిగాడు.

పిశాచి విరగపడి నవ్వి, "నేను బహు చెడ్డ పిశాచిని. కోరిన రూపంతో ఈ ఇంట్లో తిరుగుతూంటాను," అని చప్పున గబ్బిలంగా మారి గది అంతా కలయ తిరుగుతూ ఎగిరింది.

"నీకు పుణ్యం ఉంటుంది, ఇందాకటి లాగా పిల్లిగానే ఉండి ఇల్లంతా తిరుగుదూ! ఎలుకలబాధ చాలా ఎక్కువగా ఉన్నది. తరవాత బల్లిగా మారి దోమలను తినెయ్యి," అన్నాడు సంగీతం మేస్టరు.

ఆడపిశాచి రోషంగా, "నాకు అంత కన్న పనేమీ లేదనుకున్నావా?" అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

అది మర్నాడు బావిగట్టున వృద్ధ పిశాచిని కలుసుకుని, "నీ పథకం పార లేదు. వాడు మహా గట్టిపిండం!" అన్నది.

"ఒక ఎత్తు పారకపోతే ఇంకొటి పారుతుంది," అంటూ వృద్ధ పిశాచి ఆడపిశాచికి మరొక ఉపాయం చెప్పింది. అది పారవచ్చునని ఆడపిశాచికి తోచింది.

ఆ పథకం ప్రకారం ఆడపిశాచి సంగీతం మేస్టరు ఇంటి కప్పు మీది

పెంకులు పీకి కింద పారెయ్య సాగింది. ఆ చప్పుడుకు సంగీతం మేస్టరు నిద్ర లేచి, బయటికివచ్చి, "ఆ పెంకులు పీకేది ఎవరు?" అని అడిగాడు.

"నేనే! పిశాచాన్ని! ఏదో ఒకటి చేయకపోతే నాకు తోచదు!" అంటూ ఆడపిశాచి గాలిలో పల్టీలు కొట్టింది.

"ఆ దొమ్మరి ఆటలు తరవాత చేద్దూ గాని, ముందు పని కానియ్యి. ఈ మధ్య నాలుగు డబ్బులు వస్తున్నాయి; పెంకులు తీయించి, మిద్దె వేయించే ఆలోచనలో ఉన్నాను. తెల్లవారే సరికల్లా పెంకులన్నీ తీయటం పూర్తి చెయ్యాలి!" అని బయట ఒక చెట్టు కింద పడుకుని గుర్రు పెట్టసాగాడు సంగీతం మేస్టరు.

"నా చేత కూలిపని చేయించుకునేలా ఉన్నాడు. మొండివాడు!" అనుకుని ఆడపిశాచి గుడ్లగూబలా మారి, అరుచుకుంటూ బావి దగ్గిరికి ఎగిరిపోయింది.

"మంచి ఉత్సాహంలో ఉన్నట్టున్నావు! సంగీతం మేస్టర్ని ఈ దెబ్బతో వెళ్ళగొట్టావా?" అని వృద్ధపిశాచి అడిగింది.

"నా మొహం! నన్నేవాడు వెళ్ళగొట్టాడు," అన్నది ఆడపిశాచి.

తన రెండు పథకాలూ వృథాపోవటం వృద్ధ పిశాచికి అవమానమయింది. అది ఆడపిశాచికి మూడోపథకం చెప్పింది.

దాని ప్రకారం ఆడపిశాచి మర్నాడు రాత్రి నిద్రపోతున్న సంగీతం మేస్టరును తట్టి లేపింది.



"మళ్ళీ ఎందుకు తగలడ్డావు? బంగారం లాటి నిద్ర చెడగొట్టావు!" అన్నాడు సంగీతం మేస్టరు.

"నువు మర్యాదగా ఈ ఇల్లు వదిలి వెళ్ళు. ఈ ప్రాంతమంతా నాది. ఎన్నేళ్ళుగానో నేనిక్కడ ప్రశాంతంగా బతుకుతున్నాను. నువు వచ్చి నీ కర్ణకఠోరమైన సంగీతంతో నా శాంతిని భంగపరిచావు," అన్నది ఆడపిశాచి సూటిగా.

"మహ బాగా చెప్పావులే! ఎంతో కాలం నేను అద్దెకు కూడా ఇల్లు సంపాదించలేకపోయాను. సంగీతం మేస్టరుకు ఇల్లు ఎవరు అద్దెకిస్తారు? నా అదృష్టం కొద్దీ ఈ ఇల్లు తేరగా దొరికింది. శిష్యులు బాగానే వస్తున్నారు. అందుచేత నేను ఈ ఇల్లు వదిలి వెళ్ళే ప్రశ్నలేదు. నువే మరెక్కడికైనా వెళ్ళిపో. నేను అభ్యంతరం చెప్పను," అని సంగీతం మేస్టరు స్పష్టంగా చెప్పి అటు తిరిగి పడుకున్నాడు.

ఆడపిశాచి ముఖం దమ్మిడీ అంత అయింది. తీరికూర్చుని సలహాలు చెప్పటం సులభం. ఎవరి సమస్యలను వారు స్వబుద్ధితో పరిష్కరించుకున్నంత ఉత్తమం మరొకటి లేదు.

మర్నాడంతా ఆలోచించి, ఆ రాత్రి ఆడిపిశాచి సంగీతం మేష్టరుతో, "రేపు రాత్రినుంచీ నాకు సంగీతం నేర్పు. అలా కాదంటే ఉదయమే అందరితో బాటు కూర్చుని సంగీతం సాధన చేస్తాను," అంటూ నమ్మకం కలిగేటట్టు ప్రాధేయ పడింది.

సంగీతం మేస్టరు దడుచుకున్నాడు. ఇప్పుడిప్పుడే అతనికి కాస్త పేరూ, డబ్బూ వస్తున్నాయి. తాను పిశాచాలకు సంగీతం నేర్పుతున్నట్టు తెలిసిందంటే విద్యార్థులు రారుసరేగదా, ఊళ్ళోవాళ్ళు తనను ఊరి నుంచి తరిమేస్తారు.

అందుచేత సంగీతం మేస్టరు ఆ రాత్రే తన మూటా, ముల్లే సర్దుకుని, తెల్లవారగానే ఊరి అవతలివైపు మరో ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. ఆడపిశాచి సమస్య తీరిపోయింది.





# ఇద్దరు మూర్ఖులు

ఒక గ్రామంలో రామయ్య అనే రైతు తన రెండు ఎకరాల భూమిలో జొన్న వేశాడు. పైరు ఏపుగా పెరిగి, కోతకు వచ్చే తరుణంలో, సోమయ్య అనేవాడి పశువులు వచ్చిపడి, పైరునంతా పూర్తిగా నాశనం చేశాయి.

రామయ్య సోమయ్యను వెయ్యి రూపాయలు నష్టపరిహారం అడిగాడు. సోమయ్య ఒప్పుకోలేదు.

రామయ్య ఊళ్ళో పెద్దలను తగాదా తీర్చమని కోరాడు. ఊరి పెద్దలు, రామయ్య తన పొలానికి కంచె వెయ్యక, కనీసం కాపలా అయినా పెట్టకపోవటం అతని తప్పనీ, తన పశువులను అదుపులో పెట్టకపోవటం సోమయ్య తప్పనీ, అందు చేత సోమయ్య సగం పరిహారం, అంటే అయిదువందలు, ఇయ్యాలనీ తీర్పు చెప్పారు.

ఊరి మునసబు లంచగొండి. అందు చేత సోమయ్య తమ తగాదాను పరిష్కరించవలసినది మునసబు అని రామయ్యకు చెప్పి, మునసబు దగ్గిరికి వెళ్ళి, తనకు అనుకూలంగా చెబితే రెండువందల యాభై ఇస్తానన్నాడు. పరిహారం తేలికలో పోతుందని అతని ఉద్దేశం. మునసబు లంచం పుచ్చుకుని, రామయ్య తన పొలానికి కంచెవెయ్యక, కాపలా పెట్టకపోవటం అతని తప్పేననీ, సోమయ్య పరిహారం ఇయ్యనవసరం లేదనీ తీర్పు చెప్పాడు.

రామయ్య ఈ తీర్పును ఆమోదించక తాలూకా అధికారి వద్దకు వెళ్ళాడు. అతడు కూడా లంచగొండే. రామయ్య అతనికి రెండువందల యాభైరూపాయలు లంచ మిచ్చి తనకు అనుకూలంగా తీర్పు చెప్పించుకున్నాడు.

కోలార్ కృష్ణఅయ్యర్

"గ్రామంలోని చేలకన్నిటికీ కంచెలు వెయ్యాలని ఎక్కడా లేదు. రామయ్యకు కలిగిన నష్టానికి పూర్తిగా సోమయ్య బాధ్యుడు. అందుచేత, అతను రామయ్యకు వెయ్యిరూపాయలు నష్ట పరిహారం ఇయ్యాలి," అని తాలూకా అధికారి తీర్పు చెప్పాడు.

సోమయ్య జిల్లా అధికారి వద్దకు వెళ్ళాడు. అతడు కూడా లంచగొండే. "తాలూకా అధికారి నిన్ను రామయ్యకు వెయ్యిరూపాయలు పరిహారం ఇయ్య మన్నాడు గద. అందులో సగం నాకిస్తే, నీకు అనుకూలంగా తీర్పు ఇస్తాను," అన్నాడు.

అయిదు వందలు లంచం ఇచ్చినా తనకు రెండువందల యాభై లాభమే అనుకుని సోమయ్య జిల్లా అధికారికి అయిదువందలు ఇచ్చుకున్నాడు. తాలూకా అధికారి తీర్పు సరికాదనీ, మునసబు తీర్పే సరి అయినదనీ జిల్లా అధికారి తీర్పు ఇచ్చాడు.

రామయ్యకు రోషం ఎక్కువయింది. అతడు మండలాధికారి వద్దకు వెళ్ళి, ఆ అధికారికి అయిదువందలు లంచం పెట్టి, తనకు అనుకూలంగా తీర్పు తెచ్చుకున్నాడు.

ఇక తీర్పు చెప్పడానికి మిగిలినది రాష్ట్రాధికారి. ఆయన నీతిపరుడూ, న్యాయ బుద్ధి గలవాడూనూ. ఆయన అంతా విని గ్రామపెద్దల తీర్పుతో ఏకీభవిస్తూ, సోమయ్య రామయ్యకు అయిదువందల రూపాయలు ఇయ్యాలని తీర్పు చెప్పాడు. సోమయ్య రామయ్యకు నష్టపరిహారం చెల్లించాడు.

రామయ్యా, సోమయ్యా ఇంటికి తిరిగి వస్తూ, తాము గ్రామపెద్దల తీర్పు ఆమోదించనందుకు కలిగిన నష్టాన్ని లెక్కించారు. ఒక్కొక్కరికీ ఏడువందల యాభైరూపాయల నష్టమూ, శ్రమా కలిగి నట్టు తేలింది. అందుకు కారణం వాళ్ళ మూర్ఖత్వమూ, లంచగొండులను ఆశ్రయించటమూనూ.



# భూతదయ

ఒక రాజుగారు పుట్టినరోజు పండగ చేసుకుంటున్నారు. సామంతులు లెక్కలేని కానుకలు తెచ్చి యిస్తున్నారు. ఒక వేటగాడు ఒక లేడిపిల్లను తెచ్చి రాజుగారికి అర్పించాడు. రాజు సంతోషించి, వాడికి కొంగునిండా బంగారం ఇచ్చి పంపేశాడు.

అది చూసి మంత్రి, "తమరు ఆ వేటగాడికి ఇచ్చిన బహుమానం చాలా ఎక్కువేమో?" అన్నాడు.

"ఎంతమాత్రమూ కాదు. స్వేచ్ఛగా విహరించే సాధుప్రాణులకు తిరిగి స్వేచ్ఛ ఇచ్చే అవకాశం నాకు రోజూ వస్తుందా?" అన్నాడు రాజు.

"మహారాజా, మీరు ఒక్క విషయం గమనించాలి. బందీ అయిన సాధుప్రాణులను మీరు బహుమతులిచ్చి విడుదల చేస్తారని తెలిస్తే, అలాటి వాటిని పట్టుకుని మీకు ఇయ్యటానికి అనేకమంది ప్రయత్నిస్తారు. కొన్నిటికి హాని కూడా జరగవచ్చు. మీరు భూతదయ చూపాలంటే, ఎవరూ సాధుప్రాణులను పట్టరాదని శాసించండి. అంతేగాని హింసించి పట్టిన వాటిని విడుదల చెయ్యటం కరుణ అనిపించుకోదు," అన్నాడు మంత్రి.

రాజు సిగ్గుపడి, మంత్రి చెప్పినట్టే శాసనం చేశాడు. —సడ్లపల్లి చిదంబరరెడ్డి





# తెలివిగలవాడు

ఓరుగల్లు పతనం కావటంతో కాకతీయ సామ్రాజ్యం అస్తమించింది. కాకతీయ చక్రవర్తి అయిన ప్రతాపరుద్రుడి కోశాధికారులుగా ఉంటూ ఉండిన హరిహర, బుక్కరాయలు అనే ఇద్దరు అన్నదమ్ములు తుంగభద్రానదీ ప్రాంతానికి వలసపోయి, అక్కడ విజయనగరరాజ్యాన్ని నిర్మించారు. హరిహరరాయలు చనిపోయిన తరవాత బుక్కరాయలు రాజ్యాన్ని పాలించాడు. అతను ప్రజలలో ఉండే వైషమ్యాలూ, మతవిద్వేషాలూ తొలగించి, ప్రజలను చక్కగా పాలిస్తూ వచ్చాడు. మహమ్మదీయుల పాలనకు తట్టుకోలేక వలస వచ్చే హిందువులకు విజయనగరంలో ఆశ్రయం దొరికేది. అయితే బుక్కరాయలు అన్నిమతాలనూ సమంగా చూస్తూ, ఏ మతానికీ నష్టం రావడం సహించేవాడుకాడు.

ఓరుగల్లు నుంచి హిందువులు బహిరంగంగా వెళ్ళిపోవాలంటే తమ వెంట నల్లపూస కూడా తీసుకుపోరాదు; తమకు గల సమస్తమూ ప్రభుత్వ పరం చేసి మరీవెళ్ళాలి. తమ వెంట డబ్బూ, దస్కమూ తీసుకుపోగోరినవారు ఎందరినో కూడగట్టుకుని, చాలారహస్యంగా వెళ్లాలి. మహమ్మదీయులకు ఈ బాధ లేదు; వాళ్లు స్వేచ్ఛగా వెళ్ళవచ్చు, రావచ్చు.

ఓరుగల్లులో ముత్యాలు అనే హిందూ షావుకారు ఉండేవాడు. చీటికీ, మాటికీ అధికారులకు నజరానా లిచ్చుకోలేక, అతను విజయనగరం వెళ్ళిపోదామనుకున్నాడు. బహిరంగంగా వెళ్ళాలంటే అతను కట్టుబట్టలతో వెళ్ళాలి. అందుకని అతను ఒక ఫకీరుతో స్నేహం చేశాడు.

ఫకీరు చాలామంచివాడని ప్రతీతి. అతనికి ఒక ఒంటె ఉండేది. అతను

ఏ. ఆర్. శ్రీనాథశర్మ

మక్కా, మదీనా మొదలైన పుణ్యక్షేత్రాలకు వెళ్ళటానికి కూడా దానిమీదనే వెళ్లేవాడు. ఫకీరుఅనేది అతనిపేరే అయికూర్చున్నది. ఆ పేరుతో పిలిస్తే అతను గడ్డం దువ్వు కుంటూ పలికేవాడు. ఈ ఫకీరు ముత్యాలుకు సహాయం చెయ్యటానికి ఒప్పుకున్నాడు. ముత్యాలు యావదాస్తి మణుగుబంగారమూ, కొన్నిరత్నాలూనూ. వాటిని క్షేమంగా విజయనగరం చేర్చితే ఫకీరుకు లక్షరూపాయలు ఇస్తానన్నాడు ముత్యాలు.

ఫకీరు అతిరహస్యంగా బయలుదేరి విజయనగరం చేరటమూ, తరవాత పదిహేనురోజులకు ముత్యాలు కట్టు బట్టలతో బయలుదేరి, విజయనగరం చేరటమూ, ఫకీరు ముత్యాలు కోసం విజయ నగరంలో వేచి ఉండటమూ వాళ్ళు చేసుకున్న ఏర్పాటు.

ఆ ఏర్పాటు ప్రకారం ముత్యాలు, ఫకీరు బయలుదేరిన పదిహేనురోజులకు తాను కూడా బయలుదేరి, విజయనగరం చేరి, ఫకీరు కోసం వెతికాడు. ఇల్లిల్లూ గాలించినా అతనికి ఫకీరు జాడ దొరకలేదు.

జరిగినదేమంటే, అంత ధనం చూడ గానే ఫకీరుకు దాన్ని అపహరించాలని బుద్ధిపుట్టింది. విజయనగరం చేరుతూనే అతను తన గడ్డం గొరిగించి, హిందూ



వర్తకుడి వేషం వేసుకుని, ముత్యాలు సరుకంతా అమ్మేశాడు.

అతను విజయనగరం వీధుల్లో ఠీవిగా తిరుగుతూ ఒకరోజు ముత్యాలుకు ఎదు రయాడు. ముత్యాలు అతన్ని గుర్తించక, "అయ్యా, ఓరుగల్లు నుంచి రెండువారాల క్రితం ఒంటె మీద ఇక్కడికి వచ్చిన ఫకీరును మీరు చూశారా?" అని అడిగాడు.

"చూశానండీ. ఆయనకు బారెడు గడ్డం ఉంటుంది కదండీ?" అని ఫకీరు ముత్యాలును అడిగాడు.

"అవునవును. ఆయన జాడ చెప్ప గలరా?" అని ముత్యాలు అడిగాడు.

"ఆయన నిన్న ఇక్కడనే కనిపించాడు. ఆయన వద్ద కొంత బంగారమూ, మణులూ ఉన్నాయి. నన్ను కొనమన్నాడు. నేను కొనలేదు. ఇంతలో ఎవరో బాగ్దాదు వర్తకుడు వచ్చాడు. ఇద్దరూ కలిసి బాగ్దాదుకు బయలుదేరి వెళ్లారు," అంటూ ఫకీరు అలవాటుచొప్పున గడ్డం దువ్వుకోబోయాడు.

వెంటనే ముత్యాలు ఫకీరును పోల్చి, "నువే ఫకీరువు! నా డబ్బంతా కాజేశావు!" అన్నాడు.

"నేను కాదు! ఛీ, ఛీ!" అన్నాడు ఫకీరు.

ఇద్దరికీ వాగ్వాదం జరిగింది. చివరకు ముత్యాలు బుక్కరాయల వద్దకు వెళ్ళి, తనకు జరిగిన అన్యాయం గురించి చెప్పుకుని, న్యాయం చెయ్యమన్నాడు.

బుక్కరాయలు ఫకీరును న్యాయస్థానానికి పిలిపించాడు. ఆయన ఫకీరుతో, "ముత్యాలు సొత్తు ముత్యాలుకు ఇచ్చెయ్యి," అని మంచిగా చెప్పాడు.

"నేను ఫకీరును కాను," అన్నాడు ఫకీరు.

"మరి ముత్యాలు నిన్ను ఫకీరని ఎందుకంటున్నాడు?" అని బుక్కరాయలు అడిగాడు.

"నేను వర్తకుడిననీ, నా దగ్గర డబ్బున్నదనీ తెలిసి ఇతను ఈ ఎత్తు వేశాడు," అన్నాడు ఫకీరు.

బుక్కరాయలు ఒక్కక్షణం ఆలోచించి, "ఈ ముత్యాలు తెచ్చిన అభియోగం చెల్లదు. నువు వెళ్లవచ్చు," అని ఫకీరుతో అన్నాడు.

ఫకీరు ఆనందంతో పొంగిపోతూ బయటికి పోబోతూండగా, బుక్కరాయలు వెనకనుంచి, "ఆ ఫకీరును ఆగమని చెప్పండి," అని గట్టిగా కేకపెట్టాడు.

వెంటనే ఫకీరు వెనక్కుతిరిగి చూశాడు. ఆ విధంగా ఫకీరు బుక్కరాయలుకు దొరికిపోయాడు. ముత్యాలుకు తన సొత్తు తిరిగి లభించటమే గాక, ఫకీరుకు శిక్ష కూడా పడింది.



# వ్యతిరేకం

రామయ్యా, రాజమ్మా భార్యాభర్తలు. రాజమ్మ ఏమిచెప్పినా రామయ్య అందుకు వ్యతిరేకంగా చెప్పేవాడు. ఒకసారి రాజమ్మ రాబోయేపండగకు పుట్టింటికి వెళ్ళివస్తానని భర్తను అడిగింది. రామయ్య వెంటనే, "వీల్లేదు. నోరుమూసుకుని ఇంట్లోపడి ఉండు," అన్నాడు.

ఆ రాత్రి రాజమ్మ అన్న రంగయ్య పని మీద ఆ వూరు వచ్చాడు. రాజమ్మ తన అన్నతో భర్త వైనం అంతా చెప్పింది. రంగయ్య ఆ రాత్రి భోజనం చేసి, హాయిగా నిద్రపోయి, మర్నాడు ఉదయం వెళ్ళిపోతూ రామయ్యతో, "రామయ్యా, రాజమ్మను పండగకు రమ్మని అడిగాను. నువు వెళ్ళమన్నావుట గాని, తాను రానంటే రానన్నది. ఇది ఇంత పెంకెమనిషిలా తయారయిందేమిటి? దాన్ని ఏమీ అనకు," అన్నాడు.

వెంటనే రామయ్య లోపలికి వెళ్ళి, రాజమ్మతో, "పుట్టింటికి రమ్మంటే రానన్నావుట. ఎందుకు పోవూ? వెంటనే బయలుదేరు," అన్నాడు.

"వద్దండి! నేను ఇక్కడే ఉంటాను. మీరు పట్టుబట్టితే పండగరోజు ఉదయం వెళ్ళి సాయంకాలం తిరిగివస్తాను," అన్నది రాజమ్మ.

రామయ్య మండిపడి, "అదేంకుదరదు. నువు ఇప్పుడే బయలుదేరు. నోరుమూసుకుని పండగ పుట్టింట గడిపి మరీరా!" అని, బండీ తీసుకురావటానికి బయలుదేరాడు.

—పేర్నమిట్ట నాగేశ్వరరావు





# నిజమా అబద్ధమా?

పూరీ విద్యాపీఠంలో విద్యాభ్యాసం ముగించుకుని సుధీరుడూ, సురేంద్రుడూ అనే ఇద్దరు రాచయువకులు తమ దేశాలకు బయలుదేరారు. వారిద్దరూ మంచి స్నేహితులు. వారివి ఇరుగు పొరుగు దేశాలు.

దారిలో వారికొక అరణ్యం తగిలింది. అరణ్యం మధ్యలో వర్షం పట్టుకున్నది. అదృష్టవశాన వారు తలదాచుకునేటందుకు ఒక పాడుబడిన దేవాలయం దగ్గిరలోనే కనిపించింది. వారు అందులోకి ప్రవేశించేసరికి, అదివరకే అక్కడికి చేరిన బైరాగి ఒకడు వారికి కనిపించాడు.

వాళ్ళ ప్రశ్నలకు సమాధానంగా ఆ బైరాగి, ''నేనొక సిద్ధాంతిని. దేశ సంచారం చేస్తూ నిన్ననే ఇక్కడికి వచ్చాను. నాకు మనుషుల మధ్య మసలటం ఇష్టంలేదు. దేశ దేశాలు తిరిగి జ్యోతిషంలో పాండిత్యం సంపాదించాను,'' అన్నాడు.

సురేంద్రుడికి జ్యోతిషమంటే అమిత ఆసక్తి. అతను తన జాతకం ఎలా ఉన్నదో చెప్పమని సిద్ధాంతిని అడిగాడు.

''జరగబోయేది ముందే తెలుసుకుని మనిషి చేయగలది ఏమీలేదు. అది జరిగే తీరుతుంది. నా శాస్త్రాన్ని నేను మనుషులకు ఉపయోగించను," అన్నాడు సిద్ధాంతి.

''ఏ చాతగానివాడైనా ఆ మాట అనవచ్చు,'' అని సురేంద్రుడు ఎత్తిపొడిచాడు.

బైరాగి కాస్సేపు కళ్ళు మూసుకుని, ''మీరు రాక పూర్వం, ఈ అరణ్యానికి అవతల ఉన్న విదర్భ రాజ్యపు జాతకాన్ని గుణిస్తున్నాను. ఒక వారంలోగా ఆ రాజ్యంలో పెద మార్పులు

వీరేపల్లి జయరాంరెడ్డి

రాబోతున్నాయి. ప్రస్తుతం దాన్ని ఒక అసమర్థుడు పాలిస్తున్నాడు. ఆ అసమర్థుడు హత్య చేయబడతాడు. అయితే, అతన్ని చంపేవాడు కాక, మరొకడు గద్దె ఎక్కుతాడు. నా ఈ జోస్యం పొల్లు పోదు,'' అన్నాడు.



సురేంద్రుడు మరేమీ మాట్లాడలేదు. జ్యోతిషంలో ఎంతమాత్రమూ నమ్మకం లేని సుధీరుడు అసలు నోరే విప్పలేదు.

ఇంతలో వాన వెలిసింది. మిత్రులిద్దరూ బైరాగికి వీడ్కోలు చెప్పి, అక్కడి నుంచి ముందుకు సాగారు. అరణ్యం దాటగానే ఒక రహదారి వచ్చింది. ఆ దారిన ఒక దిక్కుగాపోతే విదర్భ వస్తుంది. రెండో దిక్కుగా పోతే మిత్రులు పోవలసిన దేశాలు వస్తాయి.

సురేంద్రుడు ఆగిపోయి సుధీరుడితో, '' ఈ విదర్భ వ్యవహారం ఏమిటో అంతు చూడాలని ఉన్నది. ఈ విదర్భరాజు పనికిమాలినవాడు. అతని మూలాన ప్రజలు నానా అగచాట్లూ పడుతున్నారు. వాణ్ణి చంపి విదర్భ ప్రజలకు మేలు చేస్తాను,'' అన్నాడు.

సుధీరుడు ఆశ్చర్యపడి, '' బైరాగి మాటలు నమ్మి నువు చిక్కులు కొని తెచ్చుకుంటావా? ఏదో దేశపు ప్రజలకు నువు మేలు చెయ్యటమేమిటి? పిచ్చి ఆలోచనలు చెయ్యక, మన దారిన మనం పోదాం పద. ఒకవేళ బైరాగి జోస్యం నిజమే అయినా విదర్భరాజును చంపిన ఫలితం నీకు ఉండదు. మరెవడో రాజు అవుతాడు,'' అన్నాడు.

'' ఫలితం నాకు అవసరం లేదు. మంచి ఎవరికైనా చెయ్యవచ్చు. నువు వెళ్ళు. నేను త్వరలోనే వస్తాను,'' అని సుధీరుడు విదర్భ దారిపట్టి వెళ్ళిపోయాడు.

సుధీరుడికి కాలు సాగలేదు. తన మిత్రుడు భయంకరమైన ప్రమాదంలో చిక్కుకోబోతున్నాడనీ, అతన్ని ఎలాగైనా కాపాడటం తన ధర్మమనీ అతనికి తోచింది. అందుచేత అతను కూడా



సురేంద్రుడికి వెనకగా విదర్భకే బయలు దేరాడు.

సురేంద్రుడు తిన్నగా విదర్భ రాజధానికి వెళ్ళి, ఒక సత్రంలో బస చేశాడు. సుధీరుడు ఆ సత్రాన్ని గుర్తుపెట్టుకుని, విదర్భ మంత్రి అయిన కాలకేశి ఇంటికి వెళ్ళి, తనను తాను పరిచయం చేసుకుని, తరవాత తన మిత్రుడైన సురేంద్రుడి సంగతి చెప్పాడు. అంతా చెప్పి అతను కాలకేశితో, "ఒక్క వారం పాటు నా మిత్రుణ్ణి బంధించి ఉంచి, తరవాత వదిలెయ్యండి, తనదారిన తాను పోతాడు. ఆ తరవాత అతను మీ రాజునుగాని మరొకరినిగాని హత్యచేసే ప్రయత్నం చెయ్యడని నేను హామీ ఇస్తున్నాను," అన్నాడు.

"మా రాజును హత్యచేసే ప్రయత్నంలో ఉన్నవాణ్ణి ఈ క్షణమే శిరశ్ఛేదం చేయిద్దును, కాని నిన్ను చూసి వదిలేస్తున్నాను. నువు కోరినట్టే అతన్ని వారం రోజులపాటు నిర్బంధంలో ఉంచి, తరవాత వదిలేస్తాను," అన్నాడు కాలకేశి.

సురేంద్రుడి ప్రాణానికి ఎలాటి హానీ కలగనియ్యనని మంత్రి ప్రమాణం చేసినమీదట, తన మిత్రుడు ఎక్కడ బసచేసినదీ మంత్రికి చెప్పి, సుధీరుడు మరొక సత్రంలో బసచూసుకున్నాడు.

కాని మర్నాడు ఉదయమే ఒక దుర్వార్త సుధీరుడి చెవినపడింది. అదేమంటే, సురేంద్రుడు గడిచిన రాత్రే విదర్భరాజును హత్యచేసి, రాజభటులకు దొరికిపోయాడు.

ఈ పరిణామానికి సుధీరుడు హతాశుడై పోయాడు. అతను కాలకేశి ఇంటికి వెళ్లి, "ఈ హత్య జరగకూడదనేగదా నేను ముందుగా నా మిత్రుణ్ణి బంధించమని మిమ్మల్ని హెచ్చరించాను? అతన్ని మీరు నిన్ననే ఎందుకు ఖైదు చెయ్యలేదు? మీ అలక్ష్యంవల్లనేగదా ఈ ఘోరం జరిగింది? మీ వల్లకాదంటే నేనే మరో ఉపాయం చేసి ఉండేవాణ్ణి!" అన్నాడు.

కాలకేశి ఎంతో పశ్చాత్తాపం ప్రదర్శిస్తూ, ''నువు చెప్పినట్టే చెయ్యబోయాను. కాని నీ మిత్రుడు మా ఎత్తు కనిపెట్టి తప్పించుకుపోయాడు. అతనికి మరణదండన తప్పదు,'' అన్నాడు.

సుధీరుడి మనస్సు వికలమైపోయింది. మంత్రితో మాట్లాడేది కూడా ఏమీ కనిపించలేదు. సురేంద్రుణ్ణి మరణదండన నుంచి తప్పించే ఉపాయాలు ఏమైనా ఉన్నాయా అని ఆలోచిస్తూ అతను చాలా మధనపడ్డాడు. తన మిత్రుడి మరణశిక్షకు తానే కారకుడా అన్న అనుమానం కూడా అతన్ని బాధించింది. రాజు హత్య కాకముందే తాను హంతకుడి పేరూ, ఆచూకీ మంత్రికి చెప్పేశాడు.

కొద్దిరోజులు గడిచాయి. నగరంలో మరొక వార్త పుట్టింది. మర్నాడే మంత్రి కాలకేశి పట్టాభిషేకం చేసుకోబోతున్నాడు. అదే ముహూర్తంలో సురేంద్రుడికి మరణదండన అమలు జరగబోతున్నది.

సుధీరుడు సభకు వెళ్ళాడు. సభలో జనం కిటకిటలాడుతున్నారు. కాలకేశి సింహాసనం పక్కన మరో ఆసనం మీద కూర్చుని ఉన్నాడు. సింహాసనం ఖాళీగా ఉన్నది. సభలోకి సురేంద్రుణ్ణి చేతులు బంధించి తెచ్చారు. ముందు అతని శిరశ్ఛేదమూ, తరవాత కాలకేశి పట్టాభిషేకమూ జరగవలసి ఉన్నాయి.

సుధీరుడు కాలకేశిని సమీపించి, ''ప్రభూ, రాజద్రోహి తల నరికే అవకాశం



నాకు ఇప్పించండి. ఆ పని చేసి నా బాధ్యత పూర్తి చేసుకుంటాను,'' అన్నాడు.

కాలకేశి సమ్మతించాడు.

సుధీరుడు తన కత్తి దూసి సురేంద్రుడి కేసి ఒక్క అడుగు వేసి, ఏదో సందేహం కలిగినవాడిలాగా మళ్ళీ కాలకేశి కేసి తిరిగి, మెరుపులాగా తన కత్తితో కాలకేశి తల నరికేశాడు.

హాహాకారాలు చెలరేగవలసిన సభలో చీమ చిటుక్కుమంటే వినబడే నిశ్శబ్దం! రాజభటులు నేలచూపులు చూస్తూ ఉండిపోయారు. అంతలో సభలో హర్షధ్వానాలు చెలరేగాయి. కాలకేశి చచ్చినందుకు ప్రజలు సంతోషిస్తున్నారు!

సురేంద్రుడే విదర్భకు రాజు కావాలని సభలో ఏకగ్రీవంగా నిర్ణయం జరిగింది. అతని పట్టాభిషేకం కూడా అప్పుడే జరిగిపోయింది.

తరవాత అతను తన మిత్రుడు సుధీరుణ్ణి కౌగలించుకుని, ''నువు కాలకేశిని చంపింది నన్ను రక్షించటానికా? లేక బైరాగి మాటలు అబద్ధం చెయ్యటానికా?'' అని అడిగాడు.

''ఏదీ కాదు. కాలకేశి ప్రవర్తన నాకు చాలా అనుమానాస్పదంగా కనిపించింది. ఆ దుర్మార్గుడు తన రాజును రక్షించుకోకపోగా, నువు ఆ రాజును హత్య చేసిన మీదట నిన్ను ఉపయోగించుకుని, తాను గద్దె ఎక్కాలని చూశాడు. బైరాగి జోస్యం అప్పుడే అబద్ధమయింది. నువే రాజును చంపావు, నువే రాజువు అయావు!'' అన్నాడు సుధీరుడు.

సురేంద్రుడు నవ్వి, ''లేదు, మిత్రమా! బైరాగి జోస్యం అక్షరాలా నిజమయింది. రాజును చంపినది నేను కాదు, కాలకేశి. ఆ నేరం నా మీద నెట్టి, తాను రాజు కావాలని చూశాడు,'' అన్నాడు.

సుధీరుడు ఆశ్చర్యపోయాడు. తాను కాలకేశిని చంపకపోతే అతనే రాజై బైరాగి జోస్యం అబద్ధమయేదే. అది నిజం కావటానికి సురేంద్రుడూ, సుధీరుడూ కూడా కృషిచేసిన వాళ్ళయారు!





# వీర హనుమాన్

వానరులు వేల సంఖ్యలో కుంభకర్ణుడి మీదికి దూకారు. వాళ్ళు ఆ పర్వతాకారుణ్ణి కొరికి, గీరి, పిడికిళ్ళతోనూ, మోకాళ్ళతోనూ పొడిచారు. కాని కుంభకర్ణుడు ఏ మాత్రమూ లక్ష్యపెట్టక, వానరసేనలను నిర్మూలించసాగాడు. కుంభకర్ణుణ్ణి ఆపటం వానరుల వల్ల కాదని స్పష్టమయింది.

అంగదుడూ, అతని తరవాత సుగ్రీవుడూ కుంభకర్ణుడి మీదికి కొండలు విసిరారు, కాని అవి అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. అతను సుగ్రీవుడి మీదికి తన శూలం విసిరాడు. హనుమంతుడు దారిలో దాన్ని ఒడిసిపట్టుకుని, విరిచి పారేశాడు. ఇదిచూసి వానరులు ఎంతో సంతోషించి, సింహనాదాలు చేశారు. అప్పుడు కుంభకర్ణుడు ఒక పర్వతశిఖరం విసిరి, సుగ్రీవుణ్ణి మూర్ఛపోగొట్టాడు. అది చూసి రాక్షసులు సింహనాదాలు చేశారు. కుంభకర్ణుడు మూర్ఛపోయిన సుగ్రీవుణ్ణి ఎత్తుకుని పోయాడు. సుగ్రీవుణ్ణి కాజేస్తే, రామ, లక్ష్మణులతో సహా వానరసేన వశమైనట్టేనని అతను అనుకున్నాడు. అతను సుగ్రీవుడితో సహా లంకలోకి వెళ్ళిపోయాడు.

ఇదంతా చూసి కూడా హనుమంతుడు భయపడలేదు. మూర్ఛ తెలియగానే సుగ్రీవుడు తనను తాను రక్షించుకోగలడని అతని నమ్మకం. అందుచేత అతను దిగులుపడవద్దని వానరులకు ధైర్యం

## 27. రామ లక్ష్మణుల మూర్ఛ



వానరులను భక్షించసాగాడు. అప్పుడు లక్ష్మణుడు యుద్ధానికి వచ్చి, అతని మీద బాణాలు వేశాడు. కుంభకర్ణుడు వాటిని లక్ష్యపెట్టక, రాముడి మీదికిపోయాడు.

రాముడు అతనితో, "కుంభకర్ణుడా, నువు ఇంద్రుణ్ణి జయించావు కాబోలు. నేను ఇంద్రుణ్ణి కాను, రాముణ్ణి నిన్ను క్షణంలో చంపేస్తాను," అన్నాడు.

"రాముడా, నేను విరాధుణ్ణి కాను; వాలినీ, మారీచుణ్ణీ కాను, కుంభకర్ణుణ్ణి. నీ పరాక్రమం నా మీద చూపించు, తరవాత నేను నిన్ను తినేస్తాను." అన్నాడు కుంభకర్ణుడు రాముడితో.

చెబుతూ యుద్ధ రంగంలో ఉండిపోయాడు.

అతను అనుకున్నట్టుగానే సుగ్రీవుడికి స్పృహవచ్చి చూసేసరికి, తాను కుంభకర్ణుడి భుజం మీద ఉన్నట్టు తెలిసింది. అతనికి లంకానగరపు వీధులు కనిపించాయి. అతను చప్పున కుంభకర్ణుడి ముక్కూ, చెవులూ కొరికేశాడు. కుంభకర్ణుడు నెత్తురు ఓడుతూ, సుగ్రీవుణ్ణి నేలకేసి కొట్టి, కాలితో మట్టగించాడు. అయితే సుగ్రీవుడు దాన్ని లక్ష్యపెట్టక, ఆకాశంలోకి ఎగిరి, రాముణ్ణి చేరుకున్నాడు.

సుగ్రీవుడు తప్పించుకు పోగానే కుంభకర్ణుడు తిరిగి యుద్ధభూమికి వచ్చి,

సాలవృక్షాలను ఛేదించటానికీ, వాలిని చంపటానికీ ఉపయోగించిన బాణాలను రాముడు కుంభకర్ణుడి మీద వేశాడు, కాని అవి అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. అప్పుడు రాముడు అతని మీద వాయవ్యాస్త్రం ప్రయోగించాడు. దానితో కుంభకర్ణుడి చెయ్యి, గదతో సహా తెగి పడిపోయింది.

కుంభకర్ణుడు గట్టిగా అరిచి, రెండో చేత్తో ఒక పెద్ద వృక్షం పెరికి, రాముడి మీదికి వెళ్ళాడు. రాముడు ఐంద్రాస్త్రంతో కుంభకర్ణుడి రెండో చేతినికూడా ఖండించేశాడు. అప్పటికీ కుంభకర్ణుడు రాముడి పైకి పోవయత్నించాడు. రాముడు అతని

కాళ్ళు కూడా ఖండించాడు, చిట్ట చివరకు కుంభకర్ణుడి శిరస్సు కూడా ఖండించేశాడు.

కుంభకర్ణుడు చావగానే రాక్షసులు అమితమైన దుఃఖంతో పెద్ద పెట్టున ఏడ్చారు. వాళ్ళు రాముణ్ణి చూసి హడలిపోయారు. వానరులు రాముడి చుట్టూ చేరి, అతన్ని పూజించారు.

కుంభకర్ణుడు రాముడి చేతిలో చచ్చాడన్న వార్త రాక్షసుల ద్వారా రావణుడికి చేరింది. ఈ మాట విని రావణుడు మూర్ఛపోయాడు. అతని కొడుకులైన దేవాంతకుడూ, నరాంతకుడూ, త్రిశిరుడూ, అతికాయుడూ పెద్ద పెట్టున ఏడ్చారు. అలాగే కుంభకర్ణుడి తమ్ములైన మహోదరుడూ, మహాపార్శ్వుడూ ఏడ్చారు.

మూర్ఛ తెలిసిన రావణుడు, ఇక లంక వానరుల వశమవుతుందని భయపడ్డాడు. అతనికి రాజ్యంతోనే రుణం తీరినట్టు తోచింది, సీత మాట సరేసరి. అతను రాముణ్ణి చంపి తన తమ్ముడి కోసం పగ తీర్చుకోవాలనీ, లేదా తాను కూడా చావాలనీ నిశ్చయించాడు. విభీషణుడి మాట వినక, అతన్ని దూరం చేసుకున్నందుకు కూడా రావణుడిలో పశ్చాత్తాపం కలిగింది.



రావణుడి దుఃఖం చూసి త్రిశిరుడు, "మూడు లోకాలనూ జయించగల నువు ఇలా అధైర్యపడతావేమిటి? నన్ను యుద్ధానికి పంపు. నేను రాముణ్ణి చంపి వస్తాను," అన్నాడు.

ఆ మాట విని దేవాంతకుడూ, నరాంతకుడూ, అతికాయుడూ కూడా యుద్ధానికి పోతామని ఉబలాటపడ్డారు. రావణుడు వారిని చూసి పరమానందం చెంది, కౌగలించుకుని, యుద్ధానికి పంపాడు.

మళ్ళీ రాక్షసులకూ, వానరులకూ యుద్ధం జరిగింది. రాక్షస వీరుడైన నరాంతకుడు వానరులలో భీభత్సం కలిగిస్తూండటం చూసి, అతన్ని చంపమని



సుగ్రీవుడు అంగదుడితో చెప్పాడు. అంగదుడు నరాంతకుడితో కొంతసేపు యుద్ధంచేసి, చివరకు అతన్ని చంపేశాడు.

అది చూసి త్రిశిరుడూ, మహోదరుడూ, దేవాంతకుడూ అంగదుడి మీదికి వచ్చారు. అంగదుడు సాహసంతో ముగ్గురు రాక్షసులనూ ఎదిరించి పోరాడుతూండటం చూసి, హనుమంతుడు తోడు వచ్చి, ఒక్క గుద్దుతో దేవాంతకుణ్ణి చంపాడు. అలాగే అంగదుడికి తోడువచ్చిన నీలుడు మహోదరుణ్ణి చంపేశాడు.

మహాపార్శ్వుడితో ఋషభుడు భయంకరమైన యుద్ధం చేసి, చివరకు అతన్ని చంపాడు. మహాపార్శ్వుడు చావగానే రాక్షసులు ఆయుధాలు వదిలి పారిపోయారు.

యుద్ధానికి పోయిన రాక్షస వీరులు చచ్చారని తెలిసి అతికాయుడు బయలుదేరాడు. చిన్న పర్వతంలాగా వచ్చే అతికాయుణ్ణి చూసి, రాముడు విభీషణుడితో, "ఈ రాక్షస వీరుడు ఎవరు?" అన్నాడు.

"ఇతను రావణుడికి ధాన్యమాలిని వల్ల కలిగిన కొడుకు, అతికాయుడు. ప్రతాపంలో రావణుడంతటివాడు. ఇతను బ్రహ్మదేవుడి అనుగ్రహం పొంది, దివ్యాస్త్రాలు సంపాదించి, దేవతలచేతా, రాక్షసులచేతా చావు లేకుండా వరం పొందాడు. అతను ధరించిన కవచమూ, అతను ఎక్కిన రథమూ కూడా బ్రహ్మదేవుడు ఇచ్చినవే. వీటి సహాయంతో అనేకసార్లు ఇతను దేవతలనూ, దానవులనూ జయించి, రాక్షసులను రక్షించాడు. ఇతన్ని త్వరగా చంపకపోతే వానర బలాలకు తీవ్రమైన నష్టం కలిగించగలడు," అని విభీషణుడు రాముడితో అన్నాడు.

ఈ లోపల వానరసేన మీదికి వచ్చిన అతికాయుణ్ణి కుముదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, నీలుడూ, శరభుడూ ఎదుర్కొన్నారు. కాని అతన్ని వాళ్ళు ఏమీ

చేయలేకపోగా, అతని బాణాలతో తీవ్రంగా బాధపడ్డారు.

అతికాయుడు తన మీదికి రాని వాడి మీదికి పోక, తిన్నగా రాముడి వద్దకు వచ్చి, "పారిపోయే వాళ్ళతో యుద్ధం చెయ్యను. నాతో యుద్ధం చేసే ఉత్సాహం గలవారెవరు?" అని అడిగాడు.

ఈ మాటకు లక్ష్మణుడు అలిగి, అతికాయుడి ముందుకు వచ్చి, ధనుష్టంకారం చేశాడు. అతన్ని చూసి అతికాయుడు, "లక్ష్మణుడా, చిన్నవాడివి. నీకున్న పరాక్రమం ఎంత? నాతో ఏమని యుద్ధం చేయ వచ్చావు? ఎందుకు వృథాగా చచ్చిపోతావు. అవతలికి వెళ్లు," అన్నాడు.

"శౌర్యం చూపవలసినది మాటల్లో కాదు, చేతల్లో. నిన్ను నువు పొగడుకోక, నీ పరాక్రమం నా మీద చూపు," అన్నాడు లక్ష్మణుడు.

ఇద్దరూ బాణాలతో యుద్ధం ఆరంభించారు. లక్ష్మణుడి బాణాల దెబ్బలు తిన్నమీదట అతికాయుడికి అతని మీద కొంత గౌరవం ఏర్పడి ఉత్సాహంతో యుద్ధం చేశాడు. ఇద్దరూ ఒకరి మీద ఒకరు దివ్యాస్త్రాలు ప్రయోగించారు. అతికాయుడి బాణాలు లక్ష్మణుణ్ణి బాధించాయిగాని, లక్ష్మణుడి బాణాలు



అతికాయుడి కవచాన్ని ఛేదించలేక పోయాయి. అందుచేత లక్ష్మణుడు అతని మీద బ్రహ్మాస్త్రం వేశాడు. అతికాయుడు దాన్ని ఆపటానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఆ బాణం అతికాయుడి తల నరికేసింది.

అతికాయుడి చావుతో రాక్షసుల శోకానికి అంతులేకుండా పోయింది. ఈ వార్త రావణుడికి చేరేసరికి అతను నిర్ఘాంతపోయాడు. ఎందుకంటే మేటి రాక్షస వీరులు ఒకరొకరే రామలక్ష్మణుల చేతిలో చచ్చిపోతున్నారు. వానరులను తక్కువ చెయ్యటం కూడా పొరపాటే అయింది.



తన తండ్రి విచారంలో మునిగి ఉండటం చూసి ఇంద్రజిత్తు, "నేను బతికి ఉండగానే నీకు విచారం దేనికి? నా బాణాల దెబ్బ తిని ఎవడూ ప్రాణాలతో బయటపడలేడు. ఈ రామ, లక్ష్మణుల ప్రాణాలు నేను తీస్తాను. ఇప్పుడే యుద్ధానికి బయలుదేరుతున్నాను," అన్నాడు.

అతను తండ్రి అనుమతి పొంది, ఉత్తమమైన కంచర గాడిదలు కట్టిన రథం ఎక్కాడు. అతను యుద్ధభూమికి పోతూంటే, అనేకమంది రాక్షసయోధులు రకరకాల ఆయుధాలు ధరించి, సంతోషంగా అతని వెంటవెళ్ళారు.

ఇంద్రజిత్తు యుద్ధభూమిని చేరి, దివ్యరథం సంపాదించటానికై హోమం చేయ నిశ్చయించి, రాక్షసులను తన చుట్టూ కాపలా ఉండమన్నాడు. తరవాత అతను మంత్రయుక్తంగా అగ్నిలో హోమం చేశాడు. అతను హవిస్సులు హోమం చేస్తుంటే, అగ్ని పొగ లేకుండా పెద్ద జ్వాలలతో మండింది.

తరవాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని జపించి, ఆ అస్త్రంతో తన వింటినీ, రథాన్నీ, ఇతర ఆయుధాలనూ మంత్రించాడు. హోమం పూర్తి అయింది. ఇంద్రజిత్తు తన రథంతోనూ, ఆయుధాలతోనూ, రథసారథితోనూ ఆకాశంలో అంతర్ధానమయాడు.

రాక్షససేన గుర్రాలతోనూ, రథాలతోనూ యుద్ధ రంగానికి కదిలింది. రాక్షసులు వానరుల మీద రకరకాల ఆయుధాలతో యుద్ధం ప్రారంభించారు. ఇంద్రజిత్తు వాళ్ళను ప్రోత్సహించాడు. తరవాత అతను కూడా యుద్ధంలో ప్రవేశించాడు. అతను ఒక్కొక్క దెబ్బకు అయిదారుగురు వానరులను చంపసాగాడు. అతను మామూలు వానరులనే గాక, ముఖ్యమైన వానర వీరులందరినీ క్రూరంగా హింసించాడు. గంధమాదనుడూ, నలుడూ, మైందుడూ,

గజుడూ, సుగ్రీవుడూ, ఋషభుడూ, అంగదుడూ, ద్వివిదుడూ అతని బాణాలకు తీవ్రంగా గురి అయారు. కాని, అదృశ్యంగా ఉన్న ఇంద్రజిత్తును వారు చూడను కూడా లేదు.



ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణాలు రామ, లక్ష్మణులకు కూడా తగిలాయి. రాముడు లక్ష్మణుడితో, "ఈ ఇంద్రజిత్తు అదృశ్యంగా ఉండి యుద్ధం చేస్తున్నాడు. అందుచేత అతన్ని చంపలేం. మనం అతని బాణాల మూలంగా పడిపోయినట్టు ఉన్నామంటే, అతను సంతోషించి, లంకకు వెళ్ళిపోతాడు," అన్నాడు.

అలాగే రామలక్ష్మణులు బాణాల దెబ్బలు తిని పడిపోయారు. ఇంద్రజిత్తు సింహనాదంచేసి, లంకకు తిరిగివెళ్ళాడు.

ఇంద్రజిత్తు ప్రయోగించినది బ్రహ్మాస్త్రం. ఎంతమంది వానరులు దానికి కేవలమూ బద్ధులయారో, ఎంతమంది చచ్చిపోయారో తెలుసుకోవాలన్నాడు హనుమంతుడు విభీషణుడితో.

హనుమంతుడూ, విభీషణుడూ చెరొక మండే కట్టెనూ తీసుకుని, యుద్ధభూమి అంతటా వెతకసాగారు. వాళ్ళకు ప్రాణాలతో ఉన్న జాంబవంతుడు కనిపించాడు. విభీషణుడు ఆ వృద్ధుణ్ణి పలకరించి, "ప్రాణాలతో ఉన్నావుగద!" అన్నాడు.

జాంబవంతుడికి చూపు దెబ్బ తిన్నది. అతను విభీషణుణ్ణి, "హనుమంతుడు బతికి ఉన్నాడా?" అని అడిగాడు.

"రామలక్ష్మణులను గురించి అడగకుండా హనుమంతుణ్ణి గురించి అడుగుతున్నావెందుకు?" అని విభీషణుడు జాంబవంతుడితో అన్నాడు.

"నాయనా, విభీషణుడా! హనుమంతుడు బతికి ఉండి, మిగతా వానరసేన అంతా చచ్చినా ఏమంత నష్టంలేదు. కాని అతను చచ్చిపోతే, వానరసేన అంతా బతికి ఉండినా మన మంతా చచ్చినవారిలోనే జమ అవుతాము!" అన్నాడు జాంబవంతుడు.

పెద్దవాడు ఇలా అనే సరికి హను మంతుడు ముందుకు వచ్చి, జాంబ వంతుడి రెండు కాళ్ళూ పట్టుకుని నమస్కారం చేశాడు.

జాంబవంతుడు అతనితో, ''నాయనా, హనుమంతుడా! ఇప్పుడు వానరుల నందరినీ నువే రక్షించాలి. ఆ పనికి నువు తప్ప మరెవడూ లేడు." అన్నాడు.

తరవాత రామలక్ష్మణుల మూర్ఛ పోగొట్టటానికి జాంబవంతుడు హను మంతుడికి ఒక పని చెప్పాడు :

''నువు సముద్రం మీదుగా హిమా లయానికి వెళ్ళాలి. అక్కడ నీకు అమిత ఎత్తయిన శిఖరాలు కాంచనమూ, కైలా సమూ కనిపిస్తాయి. ఆ రెంటికీ మధ్యగా ఓషధిపర్వతం ఉన్నది. దాని శిఖరం మీద నాలుగు దివ్యమైనఓషధులున్నాయి. అవి దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటాయి. వాటి పేర్లు విశల్యకరణీ, మృతసంజీవినీ, సావర్ణకరణీ, సంధాన కరణీ. ఈ నాలుగు ఓషధులనూ తీసుకుని త్వరగా రా. వాటితో వానరులను బతికించి, ఆరోగ్యవంతులను చేద్దాం.''

వెంటనే హనుమంతుడు వాయు మార్గాన బయలుదేరాడు. అతను సము ద్రాన్నీ, పర్వతాలనూ, నదులనూ, అర ణ్యాలనూ దాటుకుంటూ హిమవత్పర్వతం కేసి అమితవేగంగా వెళ్ళాడు.

హిమాలయాన్ని చేరగానే హనుమంతు డికి అనేక ఎత్తయిన శిఖరాలూ, ఆశ్ర మాలూ కనిపించాయి. బ్రహ్మకోశమూ, కైలాసపర్వతమూ, ఇంద్రుడు తపస్సు చేసినచోటూ, రుద్రబాణ మోక్షస్థానమూ, హయగ్రీవక్షేత్రమూ, బ్రహ్మకపాలమూ మొదలైన ప్రదేశాలను అతను చూశాడు. ఇంద్రుడికి బ్రహ్మ వజ్రం ఇచ్చినచోటూ, కుబేరుడి స్థానమూ, బ్రహ్మసనమూ, శివధనుక్షేత్రమూ చూశాడు. ఆఖరుకు ఔషధిపర్వతం కూడా అతనికి, కైలాస పర్వతానికీ, ఋషభపర్వతానికీ మధ్యన కనిపించింది. దానిమీద ఓషధులన్నీ వెలిగిపోతున్నాయి.






రాజస్థానులోని సుప్రసిద్ధ రాజ్యమైన మేవాడ్‌ను, 16 వ శతాబ్ది ఆరంభంలో సంగరాణా పాలించేవాడు. ఆయన గొప్ప శూరుడూ, ఉదారుడూనూ.

దురదృష్టవశాన ఆయన కొడుకులు ఆయనకు తగినవాళ్ళు కారు. రత్న అనేవాడు మరొక రాజకుమారుడితో యుద్ధంచేసి మరణించాడు. తండ్రి అనంతరం రాజైన విక్రమజితుడు అనే వాడు విలాస జీవితం గడుపుతూ ధనమూ, కాలమూ వృధా చేశాడు.





మేవాడ్‌లో అరాజకస్థితి ఏర్పడింది. ఢిల్లీలోని మొగలులకు ఆ రాజ్యాన్ని కాజెయ్యాలని బుద్ధి పుట్టింది. ఈ పరిస్థితిలో దర్బారులోని ప్రముఖులు కొందరు, బన్వీర్ అనేవాడి సహాయంతో, విక్రమజితుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేయటానికి కుట్ర చేశారు. ఈ బన్వీర్ అనే వాడు వీరాగ్రేసరుడైన పృథ్వీరాజుకు జారపుత్రుడు.



బన్వీర్ విక్రమజితుడి పైన ఆకస్మికంగా దెబ్బతీశాడు. విక్రమజితుడు ఆత్మ రక్షణ చేసుకోలేక మరణించాడు. అతని మిత్రులు పారిపోయారు.



త్వరలోనే రాజు మరణవార్త రాజ భవనమంతటా పాకింది. శోకాలూ, పెడబొబ్బలూ చెలరేగాయి.



విక్రమజితుడి కొడుకు, పసిబిడ్డ అయిన ఉదయుడు, పన్నా అనే విశ్వాసపాత్రురాలైన దాది రక్షణలో ఉన్నాడు. రాజ కుమారుడి వయసే గల కొడుకు పన్నాకు కూడా ఉన్నాడు. అంతఃపురం లోపల ఆమె ఇద్దరినీ సాకుతూ ఉండేది.

రాజు హత్య అయినట్టు పన్నాకు రాజ భవనం సేవకుడి ద్వారా తెలిసింది. ఆమె దిగ్భ్రమ చెందింది. బన్వీర్ రాజ కుమారుణ్ణి పట్టుకోవడానికి అంతః పురంలోకి వస్తున్నట్టు కూడా ఆమెకు తెలిసింది.





తాత్సారం చెయ్యటానికి లేదు. పన్నా సేవకుణ్ణి తాను చెప్పినట్టు చెయ్య నికి ఒప్పించింది. రాజుగారి పాకశాల ంచి చెత్తా చెదారమూ బయటికి తీసుకుపోయే తట్టలో సేవకుడు రాజ కుమారుణ్ణి దాచి బయటికి తీసుకు పోయాడు.

అయినా ద్రోహి అయిన బన్వీర్ రాజ కుమారుడి అంతుతేల్చినదాకా విశ్ర మించడని పన్నాకు తెలుసును. ఆమె తన కొడుకును రాజకుమారుడి పక్క మీదికి మార్చి, రెండో పక్క ఎత్తేసింది.





ఆమె ఈ పని చేసిన మరుక్షణమే క్రూరుడైన బన్వీర్ అక్కడికి వచ్చి, "రాజకుమారు డెక్కడ? త్వరగా చెప్పు!" అని కత్తి చేతబట్టి, పన్నాను అడిగాడు.



పన్నా రాజకుమారుణ్ణి రక్షించటానికి కంకణం కట్టుకున్నది. రాజకుమారుడు తప్పించుకు పోయాడంటే బన్వీర్ వెంటనే మనుషులను పంపి వెతికిస్తాడు. ఆమె పక్క మీద పడుకుని ఉన్న తన కొడుకును చూపింది. బన్వీర్ తన కత్తిని ఆ కుర్రవాడి గుండెల్లోకి దిగవేశాడు.



సేవకుడు నదీ తీరాన కాచుకుని ఉన్నాడు. త్వరలోనే పన్నా అతన్ని కలుసుకున్నది. ఇద్దరూ కోమల్‌మేర్ రాజభవనానికి పారిపోయారు. ఆ రాజకుమారుడు ఉదయసింగ్ అనే పేరుతో పెరిగి పెద్దవాడై, బన్వీర్‌ను పారదోలాడు. చరిత్రలో పన్నా త్యాగంలాటిది మరొకటి కనబడదు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

ఒక పేద కాపుకు ఇద్దరు కూతుళ్ళు. ఇద్దరికీ పెళ్ళిళ్ళు అయాయి. అదృష్టం కొద్దీ చిన్నదాని మొగుడికి కలిసి వచ్చింది. అతను డబ్బు సంపాదించి, దానితో వ్యాపారం చేసి మంచి ధనవంతుడై, ఇల్లు కట్టుకుని, దర్జాగా బతకసాగాడు. పెద్దపిల్ల జీవితం మాత్రం పేదగానే ఉండిపోయింది.

కాపు ఒకసారి తన పెద్ద కూతుర్ని చూడబోయాడు. ఆమె తండ్రి కోసం చేపల కూరా, పచ్చడీ చేసి, వరి అన్నంతో భోజనం పెట్టింది. ఆ రాత్రి చిరిచాప మీద హాయిగా పడుకున్నాడు కాపు. అతను ఇంటికి తిరిగి వెళ్ళి తన భార్యతో, "పెద్దపిల్ల నిక్షేపంగా బతుకుతున్నది," అన్నాడు.

తరవాత కొన్నాళ్ళకు అతను చిన్న కూతుర్ని చూడబోయాడు. ఆ ఇల్లూ, కూర్చునే కుర్చీలూ, సోఫాలూ, అన్ని గదులూ, వాకిళ్ళకు తెరలూ చూసేసరికే కాపుకు మతిపోయింది. భోజనాల దగ్గిర ఏమేమిటో వడ్డించారు. వాటి రుచులు కాపుకు అర్థంకాలేదు. తిన్నదంతా రాయిలాగా కడుపులో అలాగే ఉన్నట్టు తోచింది. ఆ రాత్రి అతను పడుకోవటానికి దోమ తెర కట్టిన మంచం చూపించారు. దోమతెర మీద, అంత ఎత్తున ఎక్కి పడుకోవాలి కాబోలు ననుకున్నాడు; ఎలాగో కష్టపడి దోమతెర పై భాగానికి చేరేసరికి అది కాస్తా తెగి, అతను మంచం మీద పడిపోయాడు.

మర్నాడు తెల్లవారుతూనే అతను ప్రయాణమై, కూతురు ఆగమన్నా ఆగకుండా ఇంటికి చేరి, తన భార్యతో, "మన చిన్నపిల్ల బతికే బతుకు పగవాడికూడా వద్దు! పాపం, అది ఎన్ని కష్టాలు పడుతున్నదో!" అన్నాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2 & 3 ఆర్కాట్‌రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి.

కార్డులు మాకు డిసెంబర్ 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 ఫిబ్రవరి చందమామలో ప్రకటించబడతవి.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడును.



C. V. Srinivasa Rao



B. M. Chopra

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మీటితే మ్రోగేది

రెండవ ఫోటో : ఆపితే ఆగనిది

పంపినవారు : ఎస్. వి. ఎస్. ఎస్. వర్మ, ఆర్. రాయవరం. (తూ. గో. జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

# రాజుయొక్క రహస్యం



















ఇదే రాజు యొక్క రహస్యం.
అదే మీ రహస్యం కూడా కావాలంటే
వెంటనే కొనండి

# కేమెల్
## ఇనిస్ట్రుమెంట్స్ బాక్స్




కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్ డివిజన్
జె. బి. నగర్,
బొంబాయి 400 059 (ఇండియా)

కేమెల్ వాటర్ కలర్ పెయింటింగ్, క్రేయాన్ కలర్ పెయింటింగ్ మరియు డ్రాయింగ్ కరెస్పాండెన్స్ కోర్సులలో చేరండి.
పై చిరునామాకు సంప్రదించండి.

Vision 768 Tel.

**Results of the Chandamama-Camel Colour Contest No: 5. (Telugu)**

*1st Prize:* K. Sai Prakash, Poranki. *2nd Prize:* Kadakuntla Satyanarayana, Jagtial. *3rd Prize:* K. S. Sunanda, Madras. Consolation Prizes: A. Ashok Kumar, Secunderabad. B. Babu Nagendra Prasad, Mori. N. Mangala Devi, Machilipatnam, S. Raghupathi Reddy, Khaleelwadi. V. Vijayakumar, Vellatur. Merit Certificate: N. Raju, Siddipet. M. Venkateshwar Rao, Secunderabad. K. Kamarajagupta, Vizianagaram. N. Purnachandra Srinivasa Rao, Mandapadu. A. Chandramohan, Paddapuram. Sayed Noor Ahmed, Guntakal. C. Narendar, Hyderabad. K. Parrn Jyoti, Bhubaneswar. Maneesha, Hyderabad. K. Kumar Raja, Vizianagaram.

# నవ్వుల రుచుల రాజ్యం



# బ్రిటానియా
# బ్రిటా హై కౌంట్ బిస్కట్లు
# కేవలం రూ. 1/-కి బోలెడన్ని

బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC. 24-140 TL

# విజయ సాధక దశాబ్దం

## వ్యవసాయం

ఈ పదేండ్లలో రూపొందించిన పథకాల ఫలితంగా వ్యవసాయ విప్లవం ఏర్పడింది.

పెద్ద సాగునీటి ప్రాజెక్టులకు కమాండ్ ఏరియా కార్యక్రమం ఫలితంగా సాగునీటి సదుపాయాలు ఎక్కువయ్యాయి.

## పరిశ్రమ

లైసెన్సింగ్ పద్ధతిని ఉదారం చేశారు; ఇంకా సరళం చేశారు.

అనేక రంగాల్లో స్వయం సమృద్ధి సాధించాం.

ముడి పదార్థాలు ఇంకా సులభంగా లభ్యమవుతున్నాయి.

చిన్న పరిశ్రమలకు ఇంకా ఎక్కువ ప్రోత్సాహం ఏర్పడింది.

## కమ్యూనికేషన్లు

రైలు, రోడ్డు రవాణా మెరుగుపడింది.

రోడ్లు ఇంకా బాగుపడ్డాయి.

తంతి-తపాల సదుపాయాలు విస్తరించారు.

టెలిఫోను కనెక్షన్లు పెరిగాయి.

## సాంఘిక సేవలు

గ్రామీణ ఆరోగ్య పథకాలకు ప్రాముఖ్యం ఇస్తూ ఆరోగ్య-వైద్య సర్వీసులను సంఘటిత పరిచారు.

ఇంకా ఎక్కువగా డాక్టర్లు, నర్సులు ఉన్నారు; ఆస్పత్రి పడకలు ఎక్కువయ్యాయి.

చాల రాష్ట్రాల్లో హయ్యర్ సెకండరీ స్థాయివరకు ఉచిత విద్యకు ఏర్పాట్లు జరిగాయి.

మహిళలు, యువజనుల సంక్షేమానికి ప్రత్యేక అభివృద్ధి ప్రాజెక్టులను ప్రారంభించారు.

మూల
స్వరూపాన్ని
పటిష్ఠం చేసి,
అనేక వ్యవస్థల్ని
స్థిరపరిచారు



❋

ఇది
కార్యసాధన
పూరిత
దశకం.

